శ్రీశ్రీ గురు గౌరాంగౌ జయతః

# ఆచార్య రత్నములు



సంపాదకులు :

నిత్యలీలా ప్రవిష్టులగు

శ్రీశ్రీ మద్భక్తి విలాస తీర్థ గోస్వామి మహారాజుగారి

అనుగ్రహ పాత్రులగు

త్రిదండి స్వామి శ్రీ భక్తిసుధీరదామోదర మహారాజుగారు

సేకరణ:

శ్రీల భక్తిహృదయ వనమహారాజుగారు మరియు

శ్రీల భక్తికంకణ తపస్వీ మహారాజుగారుల

అనుగ్రహ పాత్రులగు

శ్రీలలిత్ కృష్ణ బ్రహ్మచారి మరియు శ్రీ భక్తిప్రమోద

జనార్దన మహారాజు

 వెల: రూ. 15/-

ప్రకాశకులు:
శ్రీ భక్తి విబుధ వామన మహరాజు
శ్రీ రామానంద గౌడీయమఠము
కొవ్వూరు - 534 350. ఫోన్: 229

ప్రతులు వేయి
శ్రీల భక్తి సిద్ధాంత సరస్వతీ గోస్వామి వారి తిరోభావ తిథి
22-12-1994

**ACHARYA RATNAMULU**
Compiled by
Sri Lalit Krishna Brahmachari and
Sri Bhakti Pramode Janardan Maharaj

ప్రాప్తి స్థానములు.
శ్రీ రామానంద గౌడీయమఠము, కొవ్వూరు - 534 350.
శ్రీ గౌడీయమఠము, గుంటూరు - 522 001.
శ్రీ గౌడీయమఠము, మద్రాసు - 600 014.

ముద్రణ:
శ్రీ లక్ష్మీగణపతి బైండింగ్ వర్క్స్,
మెయిన్‌రోడ్, కొవ్వూరు - 534 350.

'ఆచార్య రత్నముల'ను నీగ్రంథము శ్రీమద్భక్తి విలాసతీర్థ గోస్వామి మహారాజుల వారి శతజయంత్యుత్సవముల సందర్భమున శ్రీ యం. కొమరయ్యగారు, మేనేజింగ్ డైరెక్టరు, శాలివాహన ఫైనాన్సు లీజింగ్ కంపెనీ లిమిటెడ్, సికింద్రాబాద్-వారి ద్రవ్య సహకారముతో ముద్రింపబడినది.

# ప్రకాశకుల నివేదన

భగవాన్ శ్రీ చైతన్యమహాప్రభువుల జన్మభూమియైన శ్రీధామ మాయాపుర ఆవిష్కారకులైన శ్రీల భక్తివినోద ఠాకూరులు, శ్రీచైతన్య మఠము మరియు దాని శాఖలగు శ్రీగౌడీయమఠముల స్థాపకులైన శ్రీల భక్తి సిద్ధాంత సరస్వతీ గోస్వామి ప్రభుపాదులు మరియు శ్రీ చైతన్యమఠమునకు మూలస్తంభముగను, శ్రీ చైతన్యమఠమునకు మధ్యమణిగను, చైతన్యమఠ ప్రధానమంత్రిగను పేరొందిన గురుప్రేష్ఠ శ్రీల భక్తివిలాస తీర్థగోస్వామి మహారాజుల జీవిత చరిత్రను మరియు వారి ఉపదేశములను 'ఆచార్యరత్నముల'ను పేరిట గ్రంథరూపమున ప్రచురింపబడినది. వివిధ భాషలలోను, విభిన్న గ్రంథములలో నున్న విషయములను ఆంధ్రభక్తుల కందించుటకు సరళమైన తెలుగు భాషకనువదించిన శ్రీపాద లలిత్‌కృష్ణ బ్రహ్మచారి గారికి మరియు శ్రీభక్తి ప్రమోద జనార్దన మహరాజు గారికి మా కృతజ్ఞతలను తెలుపుకొనుచున్నాము. ఈ గ్రంథముద్రణకు పూర్తిగ సహకరించిన శ్రీ యం. కుమరయ్యగారికి శ్రీ రాధాకృష్ణులాశీస్సులు కలుగవలెనని ప్రార్థించుచున్నాము. ఈ గ్రంథమును చదివినయెడల మహాత్ముల చరిత్ర, శాస్త్రసారము బోధగమ్యమగును. భక్తులీగ్రంథమును చదివి ఉపయోగము నొందెదరు గాక!

ఇట్లు

ప్రకాశకులు

శ్రీశ్రీ గురు గౌరాంగౌ జయతః



# ఆముఖము

పంచమ పురుషార్థమగు భాగవత దర్మ రహస్యము నందఱ కందిచుట కొఱకు శ్రీశ్రీరాధాకృష్ణమిళిత తనువైన శ్రీకృష్ణచైతన్య మహాప్రభువు ఈప్రపంచము నందవతరించిరి. వారు తమ సిద్ధాంతరహస్యమును శ్రీల రూపగోస్వామి, శ్రీల సనాతన గోస్వాములకు ప్రబోధించిరి. శ్రీ సార్వభౌమ భట్టాచార్యులు, శ్రీ శ్రీ ప్రకాశానంద సరస్వతుల వద్ద నిర్విశేషవాదమును ఖండించి సవిశేషవాదమే శాస్త్రసారమనువిషయమును శాస్త్రప్రమాణమూలమున స్థాపించిరి. శ్రీరాయరామానందునితో జీవుని సాధన వర్ణాశ్రమ ధర్మము నాచరించుటనుండి ప్రారంభమగుననియు, దీని పర్యవసానముమరియు కర్మ, జ్ఞానములకతీతమునగు శ్రీరాధాకృష్ణుల ప్రేమసేవయొక్క సర్వశ్రేష్ఠత్వమును లోకమునకు తెలియజేసిరి. శ్రీచైతన్యమహాప్రభువు అద్వైత వాదమునకు, ద్వైతవాదమునకు గల తారతమ్యము లను విశదపరచి అచింత్యభేదాభేద వాదమును స్థాపించిరి.

శ్రీమన్మహాప్రభువుల ఉపదేశమునొందిన షడ్గోస్వాములు మహాప్రభు నీసిద్ధాంతమును విపులీకరించుచు పెక్కు గ్రంధములను రచించిరి. శ్రీరూపానుగ సంప్రదాయమను నీ సంప్రదాయమునకు ప్రథమాచార్యులగు శ్రీజీవగోస్వామి తన నేతృత్వములో బ్రహ్మ-మాధ్వ-గౌడీయ సంప్రదాయపు అచింత్య భేదాభేద తత్వమును ప్రచారము జేయనారంభించిరి. వీరివద్ద శిక్షణనొందిన శ్రీనరోత్తమ, శ్రీనివాస మరియు శ్యామానందులు యావదుత్తరభారతమున గౌడీయవైష్ణవ సాహిత్యమును బ్రచారముగావించిరి.

ప్రస్థానత్రయమునకు స్వతఃసిద్ధ భాష్యము శ్రీమద్భాగవతము. కావున గౌడీయవైష్ణవ సంప్రదాయపూర్వాచార్యు లెవ్వరునూ ప్రస్థానత్రయమునకు సంప్రదాయబద్ధమగు రీతిలో వేరుగానెట్టి భాష్యమునూ రచించలేదు. ప్రస్థాన త్రయమగు బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు మరియు శ్రీమద్భగవద్గీత లపై భాష్యమున్ననేనది సంప్రదాయముగ పరిగణింపబడును. శ్రీల విశ్వనాథ చక్రవర్తి యొక్క ప్రథాన శిష్యుడగు శ్రీబలదేవ విద్యాభూషణప్రభువు శ్రీగోవిందునాజ్ఞను

బొంది ప్రస్థానత్రయమునకు భాష్యమునురచించి, ఈ సంప్రదాయమునందు భాష్యములేని కొఱతను తీర్చి, సంప్రదాయ దృఢత్వము నేర్పరచెను.

కాలక్రమమున నుత్తములైన యాచార్యులు లేని కారణమున సంప్రదాయానుయాయులు కేవలము బాహ్యవిషయములకే ప్రాధాన్యమునిచ్చు చుండెడివారు. వారు సిద్ధాంత తత్త్వము, భగవదారాధనలపై శ్రద్ధ జూపని కారణమున సంప్రదాయ వైశిష్ట్యము సమాజమున కృష్ణపక్షచంద్రునివలె క్షీణదశనొందినది. కొలదికాలముననే భగవదిచ్ఛచే శుక్లపక్షమున చంద్రుడు పూర్ణప్రకాశము నొందినవిధమున నీ సంప్రదాయమున వివిక్తానంది మరియు గోష్ఠానందియను రెండు తెగలకు జెందిన ఐదుగురు మహాపురుషులవతరించిరి. నిర్జనవనమున నివసించుచు భగవదారాధన చేయుచు ఆనందమనుభవించువారలను వివిక్తానంది లేదా భజనానంది యందురు. ఈ తెగకు చెందిన వారు శ్రీల జగన్నాథ దాస బాబాజీ మహారాజు మరియు శ్రీల గౌరకిశోరదాస బాబాజీ మహారాజు. సమాజమునందే నివసించుచు భగవద్భజనమునందలి ఆనందముననుభవించుచు సమాజమునందలి మానవులనుకూడ భగవదున్ముఖులుగ జేసి ఆయానందము నందించువారలనుగోష్ఠానందులందురు. ఈతెగకుజెందినవారు శ్రీల భక్తి వినోదఠాకూరు, శ్రీల భక్తి సిద్ధాంత సరస్వతీగోస్వామి ప్రభుపాదులు, మరియు శ్రీల భక్తి విలాస తీర్థగోస్వామి మహరాజులు.

శ్రీల భక్తివినోద ఠాకూరు భక్తాంబరీషునివలె తమజీవితమును భగవద్భజనయందు గడపుచు శ్రీమన్మహాప్రభువుల సిద్ధాంతమును సరళమగు భాషలో సమాజమున కందించిరి. శ్రీచైతన్య మహాప్రభువుల జన్మభూమిని పునరుద్ధరించిరి. శ్రీల భక్తి సిద్ధాంత సరస్వతీ మహోదయులు శ్రీల భక్తివినోద ఠాకూరునకు చతుర్థ తనయునిగానవతరించి, గౌడీయ సంప్రదాయములను బేరిట ప్రచలితమగుచున్న పదమూడు విధములైన అపసంప్రదాయములను ఖండించి, విశుద్ధ వైష్ణవ సంప్రదాయమును స్థాపించిరి. అందులకు శ్రీమాయాపురమందు క్రీ.శ. 1918 వ సం॥లో శ్రీచైతన్యమఠమును స్థాపించిరి. శ్రీచైతన్యమఠమునకు శాఖలుగా భారతదేశమందంతట 64 మఠములనుస్థాపించి, ప్రపంచమునందంతటను తన శిష్యబృందమును పంపి శ్రీ చైతన్యమహాప్రభువుల శుద్ధభక్తిని ప్రచారము గావించిరి. శ్రీల భక్తిసిద్ధాంత సరస్వతీగోస్వామివారి ప్రధాన శిష్యులైన శ్రీమద్భక్తి

విలాస తీర్థగోస్వామివారు నైపుణ్యముతో గురుసేవజేసి, గురుదేవుల మన్ననల నందుకొని గురుప్రేష్ఠునిగ ఖ్యాతినొందిరి. మన పూర్వాచార్యు లేరీతిన తమ జీవితమును గడిపిరో ఆవిధముగ జీవితమును గడపుచు, గురుదేవుల ఆజ్ఞలను శిరసావహించి మృదు స్వభావముతో శ్రీ చైతన్యమహా ప్రభువుల సిద్ధాంతమును యావద్భారత దేశమున ప్రచారము గావించిరి.

ఆచార్య రత్నములను నీగ్రంథమున పైనజెప్పిన ముగ్గురు ఆచార్యుల సంక్షిప్త జీవిత చరిత్ర, వారి ఉపదేశసారము క్రమముగ ప్రచురింపబడినది. దీనికై వివిధ గ్రంథములనుండి వీరి ఉపదేశములను సంగ్రహించి తెలుగునకనువదించిన శ్రీపాద లలిత్‌కృష్ణ బ్రహ్మచారి, శ్రీపాద భక్తి ప్రమోద జనార్దన మహరాజులకు శ్రీహరి గురు వైష్ణవులాశీస్సులు కలుగవలెనని ప్రతిలిపి వ్రాయుటలోను, ప్రూఫులు సరిదిద్దుటలోను సహకరించిన చిరంజీవులకు కూడ భగవదాశీస్సులు కలుగవలెనని ప్రార్థించుచున్నాము. ఈ గ్రంథముద్రణకు తోడ్పడిన శ్రీ యం. కుమరయ్య (సికింద్రాబాదు) గారికి శ్రీరాధాకృష్ణుల దివ్యాశీస్సులు, కృష్ణభక్తి లభించుగాక!

ఇట్లు
సంపాదకులు

# విషయ సూచిక



శ్రీశ్రీ రాధాకృష్ణ శ్రీ చైతన్య మహాప్రభువు
శ్రీ చైతన్యమఠములో సేవలనందుకొనుచున్న శ్రీమూర్తులు

శ్రీ శ్రీ గురుగౌరాంగౌజయతః

# శ్రీల భక్తివినోద ఠాకూర్‌లు

కలియుగ పావనావతారియగు శ్రీచైతన్య మహాప్రభువు లుప్తతీర్థ ఉద్ధారము, శ్రీమూర్తి సేవాప్రకాశము, సద్గ్రంథ రచన, గ్రంథ ప్రచారముయను కార్యములను తన అంతరంగ పార్షదుల్గు షడ్గోస్వాములకు అప్పగించిరి. షడ్గోస్వాములు చైతన్య సిద్ధాంతమును సంస్కృత భాషయందు పెక్కు గ్రంథములుగా రచించిరి. వీరిలో శ్రీ జీవగోస్వాములవారు గ్రంథ ప్రచారమునకై శ్రీ నరోత్తమ, శ్రీనివాస, శ్యామానంద ప్రభువులకు శిక్షణనొసంగి వంగదేశము, అస్సాము, మణిపూర్ మరియు ఒరిస్సా రాష్ట్రములందు బహుళ ప్రచారము గావించిరి. శ్రీల కృష్ణదాస కవిరాజ గోస్వాములవారు లోకమునకు ఎవరూ తెలియజేయలేని శ్రీ మన్మహాప్రభువుల అవతార రహస్యమును, జీవిత చరిత్రను మరియు వారు లోకమున ప్రచారము గావించిన ధర్మమును సరళ వంగభాషలో శ్రీచైతన్య చరితామృతమను గ్రంథమున రచించిరి. వారి తరువాత సంప్రదాయ పటిష్ఠమునకై శ్రీ విశ్వనాథ చక్రవర్తి ఠాకూర్‌లు, వారి శిష్యులైన శ్రీ బలదేవ విద్యా భూషణులు పెక్కు గ్రంథములను మరియు ప్రస్థానత్రయ భాష్యమును రచించిరి. తరువాత కాలక్రమమున వీరి ప్రచారము సన్నగిల్లి దాదాపు కనుమరుగై శ్రీ చైతన్య సంప్రదాయపు పేరిట పెక్కు అపసంప్రదాయములు లోకమునందు విచ్చలవిడిగ ప్రచారమునందుకొనినవి. ఈ విధముగ గౌడీయ వైష్ణవ సంప్రదాయమున అంధకారమేర్పడి, చైతన్య సంప్రదాయమనిన సమాజమునందొక ఈసడింపు కలిగినది.

భగవంతుడు గీతలో 'ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' అని నుడివిన విధమున భగవంతుడు, భగవద్భక్తులు ధర్మమున కేర్పడిన గ్లానిని తొలగించుటకు యుగయుగమున అవతరించెదరు. ఆవిధముగ గౌడీయవైష్ణవ సంప్రదాయముపై సమాజమునందేర్పడిన అనాదరమును తొలగించి సరియగు చైతన్య సిద్ధాంతమును, శుద్ధభక్తిని లోకమున కందించుటకు అపర భగీరథులైన శ్రీల భక్తివినోద ఠాకూర్‌లు ( శ్రీకేదార్‌నాథ్ దత్త) వంగదేశమున నదియాజిల్లా అంతర్గతమగు 'వీర్‌నగర్ (ఊల)' అను చారిత్రాత్మకమైన గ్రామమందు 1838వ సంవత్సరము భాద్ర బహుళ త్రయోదశిన ఆవిర్భవించిరి.

దగినవి కావు. శుక్ల వృత్తిద్వారా వచ్చెడి ధనముతోనే జీవితమును గడిపిన శ్రేయస్సు కలుగునెడిదే వీరి విశ్వాసము.

ఉపాధ్యాయవృత్తి నవలంబించుటకై దుర్గమమైన మార్గముగుండా ఒరిస్సా రాష్ట్రమందలి ఛుటీగ్రామమునకు వచ్చి ఉద్యోగము చేయుచు అచటి ప్రజల నైతికజీవనమును సంస్కరించి, వారిలోని అత్యాచార, భూదురాక్రమణల వంటి అసద్వృత్తి నరికట్టి వారి మన్ననలను పొందిరి. తరువాత ఆ ప్రాంతములో వీరే స్వయముగ ఒక ఉన్నత విద్యాలయమును ప్రారంభించి శిక్షణ నిచ్చిరి. 1859వ సంవత్సరములో పూరీయందు నిర్వహింపబడిన ఉపాధ్యాయ పరీక్షలందు ఉత్తీర్ణులై ప్రధానోపాధ్యాయులుగ కటక్, భద్రక్, మేదినీపూర్ మున్నగు ప్రదేశములలో ఉన్నత విద్యాలయములందు పనిచేసి ప్రభుత్వముద్వారా ఉత్తమ ప్రధానోపాధ్యాయులుగ ప్రశంసలనొందిరి.

మేదినీపూర్‌లో వీరు నివసించుచున్న కాలములో పలువిధములైన ధర్మ సంప్రదాయముల వారితో ధర్మమును గురించి ఆలోచన సలిపిరి. మాదక ద్రవ్యములను ఉపయోగించుట, జీవహింస మొదలగు దుర్నీతి గల దుష్ట సంప్రదాయములయందు ఎప్పుడునూ భక్తికి స్థానములేదనియు, వీటిద్వారా జీవునకు ఎన్నడునూ శుభము చేకూరదనియు వీరు స్వభావసిద్ధమైన అనుభవ పూర్వకముగ తెలుసుకొనిరి. మరియు శ్రీకృష్ణ చైతన్యమహాప్రభువు వంగదేశమునందావిర్భవించి శుద్ధభక్తి ధర్మమును ప్రచారము గావించిరని తెలుసుకొనిరి. తత్కాలిక సభ్య సమాజమునందు భక్తి ధర్మము యొక్క అనుశీలనగాని ప్రచారముగాని లేక వైష్ణవ సంప్రదాయమను పేరిట అపసంప్రదాయములు చోటుచేసుకొని నందువలన వైష్ణవ సంప్రదాయమనిన ప్రజలయందు విరక్తి భావమేర్పడినది.

తదుపరి వీరు ఉపాధ్యాయ వృత్తికి స్వస్తి చెప్పి కలక్టరువారి కార్యాలయమందు ఉద్యోగము చేయనారంభించిరి. తరువాత డెప్యూటీ మెజిస్ట్రేట్ ఉద్యోగము చేసిరి. ఛాపరా అను నగరమందు నివసించుచున్న కాలములో ఒకరు శ్రీమద్భాగవతము చదువుచుండగ ఆ మహిమవలన బ్రహ్మ దైత్యుడు నివసించుచున్న ఒక వృక్షము సమూలముగ నాశనమయినది. ఈ సంఘటన వలన పెక్కుమందికి శ్రీమద్భాగవతమందు శ్రద్ధకలిగి భాగవత పఠనమును ప్రారంభించిరి.

తీర్థ పర్యటనమునకై బయలుదేరి కాశీ, ప్రయాగ, మథురా, బృందావనము మొదలగు పుణ్యక్షేత్రములను దర్శించిరి. కృష్ణగంజ్‌నందు తదుపరి దీనాజపూర్ నందును డిప్యూటి మెజిస్ట్రేట్‌గ పనిచేసిరి. అపుడు కలకత్తా నగరమునుండి శ్రీచైతన్య చరితామృతమును, శ్రీమద్భాగవతమును ప్రయత్నపూర్వకముగ గ్రహింపగలిగిరి. సారగ్రాహియగు శ్రీభక్తివినోద్ ఠాకూర్‌లు శ్రీచైతన్య చరితామృతమును మరల మరల చదువుటవలన గౌడీయ వైష్ణవ ధర్మమునకు ఆకృష్టులై విశేషముగ వైష్ణవ ధర్మమును గురించి ఆలోచింపసాగిరి. వీరు తమ జీవనియను గ్రంథమునందు "ఈసమయమున నాకు శ్రీచైతన్య మహాప్రభువుయందు భగవంతుడను బుద్ధి ఏర్పడినది. నాలో నెలకొనియున్న వైష్ణవ ధర్మమునందలి శ్రద్ధాబీజము మొలకెత్తినది. రాత్రి పగలు కృష్ణతత్త్వముతో గూడిన శాస్త్రములనే చర్చించుటకు ఇష్టపడెడివాడను" అని వ్రాసికొనిరి. భగవంతుని కృపాబలముచే, వీరి బుద్ధియోగముచేత ఒక్క శ్రీకృష్ణుడే భగవత్తత్త్వమునకు చివరి మెట్టని ఉపలబ్ధినొందిరి. సచ్చిదానంద-ప్రేమాలంకారమనెడి చైతన్యగీతను, ఆంగ్లభాషయందు "భాగవత స్పీచ్" అను ప్రబంధమును రచించిరి.

జాజ్‌పూర్ నివాసియగు జగన్నాథదాస్ అను నతడు శ్రీమన్మహాప్రభువు యొక్క ఆనుగత్యమునుండి వంచితుడై 'అతిబాడి' అను అపసంప్రదాయమును ప్రారంభించినాడు. ఈ సంప్రదాయమునందు బిష్‌కిషన్ అను నతడు లోకమునకు తాను భగవదవతారమని తెలుపుచూ యోగబలము ద్వారా ప్రజలను మోసము చేయుచున్న విషయమును పురుషోత్తమక్షేత్రమునందలి వైష్ణవులద్వారా తెలుసుకొన్న శ్రీభక్తివినోద ఠాకూర్ మహోదయులు భారత ప్రభుత్వమునుండి ఆమోదమునొంది, సమాజద్రోహి మరియు రాజద్రోహి యగు బిష్‌కిషన్‌ను చాకచక్యముతో కారాగారమున బంధించి దండించెను. తనకు యోగబలము కలదనియు, దానిద్వారా శ్రీల భక్తివినోద ఠాకూర్‌లను సవంశముగ నాశనము చేయుదునని శపించినమా శ్రీల భక్తివినోద్ ఠాకూర్‌లు ఎటువంటి భయమునొందక, ఆతని యోగబలము ద్వారా వీరికి శారీరిక కష్టములు కలిగినను ఓర్చుకొని ఆతనికి, ఆతని అనుయాయులకు బుద్ధి చెప్పిరి. ఈ సంఘటనను చూచిన చాలమంది వీరియొక్క హృదయ దార్ఢ్యమునకు, భగవంతునియందలి అనురాగమునకు, సమాజము నందలి నకిలీ అవతారములను రూపుమాపుట యందలి

ఐశీశక్తికి ముగ్ధులై వీరిని వేనోళ్ళా ప్రశంసించిరి. ఈ సంఘటన మనకు భక్తాంబరీషుని చరిత్ర జ్ఞప్తికి తెచ్చుచున్నది.

పూరీ క్షేత్రమునందలి శ్రీరామానంద రాయుని భజనస్థలియగు 'శ్రీ జగన్నాథవల్లభ' తోటయందు 'భగవత్ సంసద్' అను పేరిట భాగవత ఉపన్యాసములను శ్రీల భక్తివినోద ఠాకూర్‌లు చెప్పుచుండెడివారు. అచటికి చాలమంది హరి పరాయణ పండితులు, మహంతలు, వైష్ణవులు వచ్చి విను చుండెడివారు. కాని సిద్ధ పురుషుడని పేరొందిన ఒక్క రఘునాథదాస్ బాబాజి అనునతను మాత్రము వీరి కంఠమున తులసిమాల, ద్వాదశాంగమున తిలకములు లేనందున, సంప్రదాయ చిహ్నములు కానరానందున, ఆయా ఉపన్యాసములకు పోక వారి అనుయాయులను కూడ పోవలదని ఆజ్ఞాపించిరి. ఈ సిద్ధపురుషునకు కొలది దినములలోనే తీవ్రజ్వరము వచ్చి బాధపడుచుండగ శ్రీ జగన్నాథదేవులు స్వప్నమునందు "శ్రీలభక్తి వినోదకూర్‌లను పరమ వైష్ణవులుగ గుర్తెరుగక వారియందు అపరాధము చేసితివ"ని తెలుపగ వారికడకుపోయి అనుగ్రహింపవలసినదని కోరగ వారిచ్చిన వస్తువును గ్రహింపగా వీరి జ్వరము పోయినది.

శ్రీజగన్నాథ మందిరమునకు వీరు ప్రధానాధ్యక్షత పదవినొంది, భగవంతుని సేవయందలి ఒడుదుడుకులను కుదుటపరచి, ఆ ఆలయ ప్రాంగణము నందు శ్రీమన్మహాప్రభువుల పాదచిహ్నములను, ప్రతిరోజు భాగవత ప్రసంగముల కొరకు భక్తి మండపమును కట్టించిరి. గౌడీయ వైష్ణవులకు ప్రసిద్ధములైన సిద్ధవకుళము, టోటా గోపీనాథ మందిరము, హరిదాస ఠాకూర్‌ల సమాధి మరియు గంభీరలందు అధిక సమయమును భగవన్నామ సంకీర్తనయందు, హరికథలయందు గడిపెడివారు. వీరు పెక్కు గ్రంథములను రచించిరి. సజ్జన తోషణి యను మాస పత్రికను ప్రచురించిరి. క్రీ.శ. 1887వ సంవత్సరమున వీరు తమ రాచకార్యములకు స్వస్తిచెప్పి తమశేష జీవితమును భగవద్భజనకై వ్రజమండలమందలి యమునా పులినమునందు గడుపుటకు ఆలోచించుకొనుచు 'తారకేశ్వర'మనుచోటకు కార్యమునకై వచ్చిరి. అచటి పనిని పూర్తిచేసుకొని ఆరాత్రచటే నిదురింపగ వీరికి స్వప్నమున శ్రీమన్మహాప్రభువులు "నీవు బృందావనము వెళ్ళిన నీ గృహమునకు దగ్గరలోనేయున్న శ్రీ నవద్వీప మండలము నందలి కార్యముల మాట ఏమగును?" అనిరి. ఈవిషయమును 'భక్తభృంగ' యను మహాశయులతో ప్రస్తావించి, గట్టి ప్రయత్నములో కృష్ణనగర్‌నకు డెప్యూటీ

మెజిస్ట్రేట్‌గ బదలీచేయించుకొని శ్రీమన్మహాప్రభువుల ఆవిర్భావ క్షేత్రమును కనుగొనుటకు తీవ్రప్రయత్నము చేయనారంభించిరి. ఒకరోజు వీరు 'రాణీ ధర్మశాల' అను మేడపై కూర్చొని హరినామము చేయుచుండగ గాఢాంధకార రాత్రియందు ఉత్తర భాగమందున్న ఒక పెద్ద తాడిచెట్టుకు సంలగ్నముగ అలౌకిక వస్తువులు, కాంతితో ప్రకాశించు భవనములను వీరు దర్శించిరి. తరువాత వీరు 'శ్రీనవద్వీప ధామ పరిక్రమ', 'శ్రీ చైతన్య భాగవతము' మరియు కృష్ణనగర్ కలక్టెరు కార్యాలయమందు రక్షణలోనున్నప్రాచీనదస్తావేజులు వెదకి నవద్వీప నగరాంతర్గత శ్రీమాయాపూర్‌నందలి శ్రీమన్మహాప్రభువుల జన్మభూమిని కనుగొనిరి. విభిన్న స్థానములనుండి పండితులను రప్పించి, కృష్ణనగరమందలి ఎ.బి. స్కూల్‌లో గొప్ప బహిరంగ సభను ఏర్పరచి అందు ప్రమాణ పూర్వకముగ శ్రీమన్మహాప్రభువుల ఆవిర్భావ స్థానము నిర్ణయించి అందరి ఆమోదమునొంది ఆసభయందు 'శ్రీమాయాపూర్‌నందు శ్రీగౌరహరియొక్క సేవా ప్రకాశము' మరియు సమగ్ర నవద్వీప మండల ప్రచారము కొరకు "శ్రీ నవద్వీపధామ ప్రచారిణీసభా" అను సంస్థలను స్థాపించిరి. వీరు పలుచోట్ల నామహట్టములను ప్రచారకేంద్రములను స్థాపించిరి. వీరి ప్రచారము వలన చాలమంది చైతన్య మహాప్రభువు ప్రబోధించిన సరియగు వైష్ణవ ధర్మమును తెలుసుకొని అనుసరింపసాగిరి.

క్రీ.శ. 1890వ సంవత్సరమున శ్రీమాయాపురమునందు ఒక మందిరమును నిర్మించి శ్రీమన్మహాప్రభువుల సేవను ప్రారంభముచేసి, వీరి రాచకార్యములన్నిటికి 1894లో పూర్తిగ స్వస్తిచెప్పి గోద్రుమ ద్వీపములో సురభికుంజమను స్థలమున తీవ్ర వైరాగ్యముతో భగవద్భజన చేయసాగిరి. పురుషోత్తమ క్షేత్రమందు భక్తికుటియను ఆశ్రమమును, రాధాకుండమందు స్వానంద సుఖద కుంజమను ఆశ్రమమును నిర్మించిరి. శ్రీ చైతన్య సంప్రదాయమునకు వీరు చేసిన సేవకు మహాత్మా శిశిర్ కుమార్ వీరికి "సప్తమ గోస్వామి"యని బిరుదు నొసంగిరి.

భగీరథుడు గంగను తెచ్చి ప్రపంచమును పునీతముగావించిన విధముగ శ్రీల భక్తివినోద ఠాకూర్‌లు-శుద్ధభక్తియనెడి గంగా ప్రవాహముచే సర్వజీవులను తరింపచేయుచూ, తమ జీవితమున అంబరీష మహారాజువలె ఎన్నిరాచ కార్యము లందున్నను నిత్యము రెండులక్షల హరినామ జపము చేయుచు వంగ, ఆంగ్ల, సంస్కృత, పార్శీ, ఓఢ్ర, అస్సామీ, హిందీ భాషలందు పెక్కు భక్తి గ్రంథములను రచించి క్రీ.శ. 1914 సం. జూన్ 23వ తేదీన స్వధామమును చేరిరి.

# భక్తిఅనుశీలన విధి

వర్ణాశ్రమ రూప ధర్మము నాచరించుచు జీవనము గడుపు వైధీ భక్తులు తమ మనస్సును శ్రీకృష్ణ పాదపద్మములందు లగ్నము చేయుటకు చేయు ప్రయత్నమే భక్తి యోగము.

ఈ భగవదనుశీలనము పంచవిధములు :-

1. శరీరగతానుశీలనము 2. మనోగతానుశీలనము
3. ఆత్మ గతానుశీలనము 4. ప్రకృతిగతానుశీలనము
5. సమాజగతానుశీలనము

1) శరీరగతానుశీలనము :- శరీరగతానుశీలనము 7 విధములు. 1. శ్రవణ గతానుశీలనము 2. కీర్తన గతానుశీలనము 3. అఘ్రాణగతానుశీలనము. 4. దర్శనగతానుశీలనము 5. స్పర్శ గతాను శీలనము 6 స్వాదుగతానుశీలనము 7. అంగ గతానుశీలనము.

వీనిలో శ్రవణగతానుశీలనము 3 రకములు :-

1. శాస్త్రశ్రవణము. 2.భగవన్నామ శ్రవణము లేక భగవద్విషయిక సంగీత శ్రవణము 3. భక్తి పూర్వక ఉపన్యాస శ్రవణము.

భగవత్ తత్త్వ విచార శ్రవణము, భగవల్లీలాది వర్ణన రూపమగు శ్రీ మద్భాగవతాది గ్రంధమును వినుట, వైష్ణవ జీవన చరిత్రములు వినుటయు, వైష్ణవ గృహములందు పురాణములను, ఇతిహాసములను వినుట శాస్త్ర శ్రవణమన బడును. అవైష్ణవ సిద్ధాంతములను త్యజించి మహాజనులచే రచింపబడిన సకల తత్త్వ గ్రంధములను టీకా సహితము వినుటయే ప్రధాన భగవదనుశీలన కార్యము అని గుర్తించవలెను. కేవలము యింద్రియ తృప్తి కొరకు గాక, భగవల్లీలా వర్ణన మూలమున భక్తి వృత్తికి పుష్టి కలిగించు సంగీతములను వినవలెను. కర్ణేంద్రియమునకు ఆనందము కల్గించునట్టియు విషయ వాంఛలతోగూడిన చిత్తమునకు విషయాను రక్తిని పెంచునట్టియు సంగీతములను త్యజింపవలెను. భగవత్సేవాకాలమునందు జరుగు గీతావాయిద్య వందనాదులను వినుట శ్రేయస్కరము.

శరణాపత్తి :- సమస్త ధర్మములను విడచి జీవుడు శరణా పన్నుడగుట యొక భక్తి విశేషము (గీత 18-56). కాని వైధీ భక్తులంతటి అధికారము పొందుటలేదు. భగవంతుడొక్కడే ఆశ్రయింపదగినవాడను నిశ్చయ బుద్ధియే వారలకు శరణాపత్తి అగుచున్నది.

దాస్యము :- భగవద్దాస్యము ఒక మానసిక భావము (గీత 18-65). వైధీభక్తులు రస విశేషాంతర్గతమగు దాస్యమును సంపూర్ణముగా ఆస్వాదించలేరు.

జిజ్ఞాస :- జిజ్ఞాస అనునది ప్రధాన కార్యము (గీ-18-55). భగవత్తత్త్వ జిజ్ఞాస కలిగినంతనే మొదట గురుపాదాశ్రయము, తరువాత దీక్ష మరియు భజన ప్రక్రియ, జ్ఞానమును బొందనగును.

3. ఆత్మగతానుశీలనము :- ఇది ఆరు విధములు 1. సఖ్యము 2. ఆత్మనివేదనము 3. భగవంతుని కొరకే సమస్త కర్మలు చేయుట (లేదా) ఆచరించుట 4. అవసరమగునంతవరకే విషయ స్వీకారము 5. భగవంతునికై సర్వభోగవర్జనము మరియు 6. సాధుమార్గానువర్తనము.

వైధీభక్తులకు సంబంధించి చెప్పబడిన ఆత్మ పరిచయమునందు జడ బద్ధమగు ఆత్మ చెప్పబడినది కాని జడముక్త ఆత్మ చెప్పబడలేదు. పరిశుద్ధాత్మకు ప్రాకృతాహంకారము లేదు. వైధీభక్తుల ఆత్మ జడ బంధములనుండి విడివడుటకు ప్రయత్నించుచుండును. అందువలన వారలకు ప్రాకృత సంబంధము తెగి పోవుచున్నను ప్రాకృతాహంకారము మాత్రము వారలను విడువదు (గీత 18-52-54). అట్టి అవస్థ నందుండు ఆత్మ వైధీభక్తి సాధనకాలమందు తన సంబంధమగు భావ విశేషమును విచారించును. అట్టి విచారమునే ఆత్మగత భగవద్ అను శీలనమందురు.

మొదట భగవంతుడు తనకత్యంత ప్రియ సఖుడను భావము కలుగును. కాని ఆసఖ్యము రసగత సఖ్యము కంటె భిన్నమైనది. ఈ సఖ్యమే రసగత సఖ్యమునకు బీజస్వరూపము.

భగవంతుని పాదపద్మములందు ఆత్మ తన సర్వస్వమును నివేదించును. వాదని చెప్పునదంతయు నేను భగవంతుని కర్పించి వేసితిని అనెడి నిశ్చయ బుద్ధి

కలిగి వైధీ భక్తుడు ఆత్మ రక్షణమును గూర్చి ప్రయత్నింపడు.

శరీరగత, మనోగత కర్మలనతడేవియు చేయునో, అవి అన్నియు భగవంతుని ఉద్దేశించి చేయుచుండును. తన భార్య, మిత్రుడు, గృహము, పశువులు, ధనము, సంపత్తి, శరీరము, మనస్సు మున్నగునవి అన్నియు భగవత్సేవోపకరణములని అతడు తెలుసుకొనును. సమస్త విషయములు భగవంతునివే, వానిలో ఏవి నాకు మిగులావశ్యకములో వానిని భగవత్సేవయందు ఉపయోగించి నేను భగవంతుని వద్దనుండి ప్రసాద రూపమున స్వీకరించితిని. ఇంతకు మించి యితరద్రవ్యములతో నాకు పని లేదు. అని తత్కాలమందు అతడు భావించును.

భగవంతుని కొరకు అతడు సమస్త భోగములను పరిత్యజించును. పూర్వులును, వారికి పూర్వులును నగుభక్తులు ఏది సాధుమార్గమని స్థిరపరచిరో దానినే తాను స్వీకరించి శక్తివంచన లేకుండా దానిని అనుసరించును.

4. ప్రకృతిగతానుశీలనము :- 1. దేశగతానుశీలనము (భా.7-14-28). 2. కాల గతాను శీలనము (భా.7- 14-25). 3. ద్రవ్యగతాను శీలనము (భా.7- 14-35) అని మూడు విధములు.

దేశగతానుశీలనము:- విష్ణు సంబంధ తీర్థములకు పోవుట, భగవదాధిష్టానములగు స్థానములకు పోవుట, వైష్ణవ గృహములను, జీర్ణ దేవాలయములను దర్శించుటకై వెడలుట అని మూడు విధములు.

కాలగతానుశీలనము :- ఏకాదశి మరియు భగవంతుని జన్మ తిథులు, భక్తుల జన్మ తిథుల యందు విధి పూర్వకముగా ఉపవాసముండి భగవంతుని, భక్తుల లీలలను స్మరించుట.

ద్రవ్యగతానుశీలనము :- ఇది అనేక విధములు. వృక్షము ద్రవ్యవిశేషము. అత్యంత పవిత్రములగు రావి, ఉసిరిక, తులసి మొదలగు వృక్షములయందు భగవచ్చింతనము చేయనగును. శ్రీమూర్తి యొక ద్రవ్య విశేషము. జీవుని శుద్ధ చిత్తమందు ప్రతిఫలించిన భగవత్స్వరూపము యొక్క అవతారరూపమగు శ్రీమూర్తిని సేవించుట ముఖ్య కర్తవ్యము. పర్వతములలో గోవర్ధనమును, నదులలో గంగా, యమునలను పశువులయందు గోవులు, గోవత్సములు, భగవదను

# సద్గుణము - భక్తి

శ్రీ భక్తి రసామృతసింధువు అను గ్రంథములో వర్ణించిన భక్తికి ఆరు మహాత్మ్యములలో "శుభదత్వ"మొక మహాత్మ్యమని కీర్తింపబడినది. శుభములు ఎన్నివిధములు? దీనికి సమాధానముగా నిట్లు చెప్పబడినది.

శుభదత్వమ్

**శుభానిప్రీణనం సర్వజగతామనురక్తతా !**

**సద్గుణాః సుఖ మిత్యాదీన్యాఖ్యాతాని మనీషిభిః ॥ (1 – 1 – 27)**

భగవద్భక్తి కలిగినవారు జగత్తునకు సంతోషమును కలిగింతురు. జగత్తు కూడా వారిని ప్రేమించును. ఆయన సునాయాసముగ సమస్త సద్గుణములు గలవాడగును. ఆయన పవిత్రమైన సుఖమును, పెక్కు విధములైన శుభములను పొందును. పండితులు వానిని శుభమని వర్ణింతురు.

భక్తులు సర్వ సద్గుణములు కలవారను విషయమున శ్రీమద్భాగవతము యిట్లు సెలవిచ్చినది.

**శ్లో ॥ యస్యాస్తిభక్తిర్భగవత్యకించనా - సర్వైర్గుణైస్తత్ర సమాసతే సురాః ।**

**హరావభక్త స్యకుతో మహద్గుణా మనోరథేనాసతి ధావతో బహిః ॥**

**(భా.5.18.12.)**

సకల సద్గుణములతో బాటు దేవతలు భగవంతుని యందు భక్తి గలవారిని ఆశ్రయించి ఉందురు. అసత్యమగు బాహ్య వ్యాపారములయందు మనస్సు పరుగిడుచున్న అభక్తులకు మహద్గుణములు ఎట్లు కలుగును? ఈ విషయమున స్కాందపురాణమిట్లు చెప్పుచున్నది.

**శ్లో ॥ ఏతేనహ్యద్భుతేవ్యాధ - తవాహింసాదమోగుణాః ।**

**హరిభక్తౌ ప్రవృత్తామె - న తేస్యుః పరతాపినః ॥**

**అంతః శుద్ధిర్బహిః శుద్ధి - సప్తః శాంతాదయస్తథా ।**

**అమీగుణాః ప్రపద్యంతే - హరి సేవాభికామినామ్ ॥**

ఓ వ్యాధా! నీకు అహింసాది సద్గుణములు కలుగుననను విషయము నాశ్చర్యమేమియు లేదు. ఏలయన హరిభక్తియందు నిమగ్నమై యున్నవారు సహజముగనే యితరులను పీడించు విషయమున విరక్తి కల్గియుందురు. అంతఃశుద్ధి, బహిః శుద్ధి, తపము, శాంతి మొదలగు గుణములు హరి సేవయందు ఆసక్తి కలవారిని ఆశ్రయించి యుండును.

సద్గుణములను గురించి చైతన్య చరితామృతములో

కృపాళు, అకృతద్రోహ, సత్యసార, సమ ।
నిర్దోష, వదాన్య, మృదు, శుచి, అకించన ॥
సర్వోప కారక, శాంత, కృష్ణైక శరణ।
అకామ, నిరీహ, స్థిర, విజిత షడ్గుణ ॥
మితభుక్, అప్రమత్త, మానద, అమానీ ।
గంభీర, కరుణ, మైత్ర, కవి, దక్ష, మౌనీ ॥

కృపాళువు, సత్యమునే ఆధారముగా స్వీకరించినవాడు, సమభావము కలవాడు, దోషము లేనివాడు, దానము చేయు స్వభావము గలవాడు, పవిత్రత గలవాడు, అకించనుడు, అందరికి ఉపకారము చేయువాడు, శాంతభావము గలవాడు, కృష్ణుని మాత్రము శరణు జొచ్చినవాడు, కోరిక లేనివాడు, నిరీహుడు, స్థిరచిత్తము గలవాడు, అరిషడ్వర్గములు జయించినవాడు. పరిమితముగా భుజించువాడు, ప్రమత్తత లేనివాడు, అందరకు గౌరవమిచ్చు వాడు, తనకు గౌరవము కావలెననుభావము లేనివాడు, గంభీరుడు, కరుణ గలవాడు, మైత్రీ భావముగలవాడు, కవి, నిపుణత్వము గలవాడు, మౌనము పాటించువాడు మున్నగు 26 లక్షణములు భక్తులకు కలవు. ఈ సద్గుణములు అన్నియు భక్తికి సహచరములై యున్నవి. యిచ్చట ఒక ప్రశ్న ఉదయించవచ్చును. అది ఏమన, యీ గుణములన్నియు కల్గిన తరువాత భక్తులగునా? లేక భక్తి కల్గిన తరువాత ఆ గుణములు కల్గునా? దీనికి సమాధానమేమనగా

సుకృతి ఫలితముగా శ్రద్ధ కలిగి ఆ జీవుడు సాధువుల చరణముల యందు శరణుబొంది, భజన క్రియ ప్రారంభించును. అనర్థములు తొలగిన తరువాత శుద్ధ భక్తి లభ్యమగును. అనర్థములు నాశనము కానంతవరకు, సద్గుణములు

వెల్లడి కానంతవరకు భజనాభాసము లేక నామాభాసమే అయి వుండును. ఈ పరిస్థితి దాటిన తరువాత సాధకునకు అనర్థములందుగాని, పాపములందుగాని రుచి వుండదు.

శ్రీ చైతన్యమహాప్రభువు యిట్లు నుడివిరి

**ఏకకృష్ణనామ కరే సర్వపాపక్షయ ।**
**నవవిధభక్తి పూర్ణ నామ హైతేహయ ॥ (చై.చ.మ. 15.107)**

శుద్ధనామ మొకటి అయినా జపము చేసినచో పాపములన్నియు నాశనమగును. శ్రీహరినామ సంకీర్తనము వలననే నవవిధ భక్తి పరిపూర్ణమగును. కృష్ణ భక్తితోపాటు వెనువెంటనే జీవునకు సర్వజీవులపై దయ, నిష్పాపత్వము, సత్యసారత్వము, సమదర్శిత్వము, నమ్ర భావము, శాంతి, గంభీరత, సరళత, మైత్రి, ఫలదక్షత, అసత్కథలయందు విరక్తి, పవిత్రత, హీనమైన కోరికలను విడచుట మొదలగు గుణములు సహజముగా ఉదయించును. మిగిలిన గుణములు సంపాదించుటకు పాటుబడవలసిన అవసరము భక్తులకు లేదు. శుద్ధ భక్తిని పరిశీలించిన చాలును. దీనివలననే అనర్థములు తొలగి అచిరకాలము లోనే సద్గుణములు కలుగును.

యోగమార్గమందు గల యమ-నియమ-ప్రత్యాహార మొదలైన వానిని అభ్యసించు పద్ధతులన్నియు కష్టతరమైనవి. బహుకాలము అభ్యాసము చేయవలెను. అందు మరల పెక్కు అవాంతరములు గలవు. భక్త్యున్ముఖీ శ్రద్ధ గలిగిన జీవులకు యోగమార్గములోని గుణములు సహితము సంపాదించుటకు వీలగును. యోగమార్గముచేత, నీతిమార్గమునకు కలిగించు గుణములతో భక్తులకు ఎట్టి అవసరము లేదు. ఆయామార్గములోని వారు సకల సద్గుణ సంపన్నులై కూడ భక్తి లేనివారైయుండినచో అది సహజ సౌందర్యములేని స్త్రీ కృత్రిమ అలంకారములను ధరించువట్టిదియే అగును. పక్షాంతరమున వారు ఏదో ఒక సుకృతితోపాటు సాధుకృప వలన భక్త్యున్ముఖీ శ్రద్ధ పొందగలిగినచో అచిర కాలములోనే ఉత్తమ భక్తి సాధనచేయుటకు, శ్రద్ధ కలవారగుదురను విషయమున సందేహములేదు.

# దశమూలశిక్ష

ఆమ్నాయః ప్రాహతత్త్వం హరిమిహ పరమం సర్వశక్తిం రసాబ్ధిమ్
తద్భిన్నాంశాంశ్చ జీవాన్ ప్రకృతి కబళితాన్ తద్విముక్తాంశ్చ భావాత్ ।
భేదాభేద ప్రకాశం సకలమపి హరేః సాధనం శుద్ధ భక్తిం
సాధ్యంతత్ ప్రీతి మేవేత్యుపదిశతి జనాన్ గౌరచంద్రః స్వయం సహః ॥

గురు పరంపర ద్వారా పొందిన వేద వాక్కుల నామ్నాయమందురు. వేదములు తదనుగతములైన శ్రీమద్భాగవతాది స్మృతి శాస్త్రములు, తదనుగతమైన ప్రత్యక్షాదులు ప్రమాణములుగా అంగీకృతము లైనవి. ఈ ప్రమాణములచే క్రింది చెప్పబడినవిసిద్ధములైనవి.

1. హరియే పరమతత్త్వము.
2. ఆయన సర్వశక్తిమంతుడు.
3. ఆయన అఖిలరసామృత సింధువు.
4. ముక్త, బద్ధ జీవులు యిరువును ఆయన విభిన్నాంశములు.
5. బద్ధ జీవుడు మాయాధీనుడై ఉండును.
6. ముక్త జీవుడు మాయ నుండి ముక్తుడగును.
7. చిదచిదాత్మకమగు జగత్తు అంతయు శ్రీహరియొక్క అచింత్యభేదాభేద ప్రకాశమే.
8. భక్తియే ఏకైక సాధనము.
9. కృష్ణ ప్రేమ ఒక్కటియే సాధ్య వస్తువు.

ఈ తత్త్వములు ఒక్కొక్క శ్లోకమున వివరింపబడెను.

1. వేదమే పరమ ప్రమాణము

**స్వతః సిద్ధోవేదోహరిదయిత వేధః ప్రభృతితః**
**ప్రమాణం సత్ప్రాప్తం ప్రమిత విషయాన్ తాన్నవ విధాన్ ।**

తథా ప్రత్యక్షాది ప్రమిత సహితం సాధయతినః
నయుక్తిస్తర్కాఖ్యాప్రవిశతి తథాశక్తి రహితా ॥

శ్రీహరి కృపకు పాత్రులైన బ్రహ్మాదుల ద్వారా సంప్రదాయ రూపమున వచ్చిన స్వతస్సిద్ధమైన వేదములను ఆమ్నాయములందురు. ఆమ్నాయములు తదనుగత ప్రత్యక్షాది ప్రమాణముల సాహాయ్యముచే నవవిధములగు ప్రమేయతత్త్వములను సాధన చేయుచున్నది. కేవలము తర్కముతో గూడియున్న యుక్తి అచింత్య విషయములను వివరించుటలో పూర్తిగ అసమర్థమైనదగును. అందువలన అచింత్య తత్త్వ వ్యాపారమున తర్కమునకు తావులేదు.

2. హరియే పరమతత్త్వము.

హరిస్త్వేకం తత్త్వం విధి శివసురేశ ప్రణమతః
యదేవేదం బ్రహ్మాకృతి రహితం తత్తనుమహః ।
పరాత్మాత స్యాంశో జగదనుగతో విశ్వజనకః
సవైరాధా - కాంతో నవజలద కాంతిశ్చి దుదయః ॥

బ్రహ్మ, శివేంద్రాదులైన దేవతలు నిరంతరము నమస్కరించు ఆహరియే ఏకైక పరమతత్త్వము. శక్తి రహిత నిర్విశేష బ్రహ్మము శ్రీహరి అంగకాంతి. జగత్సృష్టియొనర్చి దానిలో స్వాంశముచే ప్రవిష్టుడై యుండు సర్వాంతర్యామి యగు పరమాత్మ ఆశ్రీహరి అంశమే. ఆ శ్రీహరియే నవజలధర కాంతితో గూడిన చిత్స్వరూపుడగు శ్రీరాధావల్లభుడు.

3. శ్రీహరి సర్వ శక్తిమంతుడు

పరఖ్యాయాః శక్తేరపృథగపి సస్వేమహీమని
స్థితో జీవాఖ్యాం స్వామచిదభిహితాం తాం త్రిపదికామ్ ।
స్వతేంత్రేచ్ఛా శక్తిం సకలవిషయే ప్రేరణపరః
వికారాద్యైః శూన్యః పరమపురుషో యం విజయతే ॥

తన అచింత్య పరాశక్తి కంటె అభిన్నుడైనను భగవానుడు స్వతంత్రుడు, ఇచ్ఛామయుడు. ఆ పరమపురుషుడు స్వమహిమ స్వరూపమున నిత్యమూ

ఉండును. చిచ్ఛక్తి, జీవశక్తి, మాయాశక్తి రూపత్రిపదిక పరాశక్తిని ఉపయుక్త వ్యాపార విషయమున ఎల్లప్పుడు ప్రేరేపించును. ఇట్లు చేయుచును స్వయముగ నిర్వికారుడై ఆ పరమతత్త్వరూపుడగు భగవానుడు తన పూర్ణ స్వరూపమున నిత్యము ప్రకాశించుచుండును.

4. శ్రీ హరి అఖిల రసామృత సింధువు :

సవైహ్లాదిన్యాయాః ప్రణయవికృతేః హ్లాదనరతః
తథా సంవిచ్ఛక్తి ప్రకటిత రహో భావ రసితః।
తయా శ్రీసంధిన్యా కృత విశద తద్ధామ నిచయే
రసామ్భోధౌమగ్నో వ్రజరస విలాసీ విజయతే ॥

స్వరూపశక్తికి హ్లాదిని, సంధిని, సంవిత్ అను మూడు విధములగు వృత్తులున్నవి. హ్లాదిని యొక్క ప్రణయ వికారమున కృష్ణుడెల్లప్పుడు అనురక్తుడై యుండును. సంవిచ్ఛక్తిచే ప్రకటితములైన అంతరంగభావములచే ఆయన ఎల్లప్పుడు రసిక స్వభావము కలవాడై యుండును. సంధినీశక్తిచే ప్రకటితములైన నిర్మల బృందావనాదిధామములలో స్వేచ్ఛామయుడైన వ్రజ రస విలాసియగు కృష్ణుడు నిత్యము రససముద్రమున నిమగ్నుడై యుండును.

5. బద్ధముక్త జీవులు భగవంతుని విభిన్నాంశములు :

స్ఫులింగాః బుద్ధాగ్నేరివ చిదణవో జీవనిచయాః
హరేః సూర్యస్యైవా పృథగపి తు తద్భేద - విషయాః।
వశే మాయాయస్య ప్రకృతి - పతిరేవేశ్వర ఇహ
సజీవో ముక్తో పి ప్రకృతి - వశయోగ్యః స్వగుణతః ॥

మండుచున్న అగ్ని నుండి ఎన్నియో చిన్న చిన్న రవ్వలు లేచునట్లు చిత్ సూర్య స్వరూపుడైన శ్రీహరి కిరణ కణ స్థానీయములైన చిత్ పరమాణువులు జీవులైయున్నవి. శ్రీహరి కంటె అభిన్నులైనను యీ జీవులు ఆయనతో నిత్యము భిన్నముగనే యుండును. ఈశ్వరుడు మాయాశక్తికి అనగా ప్రకృతికి అధీశ్వరుడు. జీవుడు ముక్తావస్థలో గూడ తన స్వభావము ననుసరించి మాయా ప్రకృతిక

ధీనుడగుటకు యోగ్యుడై యుండును. ఇదియే ఈశ్వర జీవులలో గల నిత్య భేదము.

6. బద్ధజీవుడు మాయాధీనుడై ఉండును

స్వరూపార్థైర్హీనాన్ నిజసుఖపరాన్ కృష్ణ విముఖాన్
హరేర్మాయా దణ్డ్యాన్ గుణనిగడజాలైః కలయతి ।
తథా స్థూలైర్లిఙ్గై ర్ద్వివిధావరణైః క్లేశనికరై
ర్మహో కర్మాలానైర్నయతి పతితాన్ స్వర్గనిరయౌ ॥

జీవుడు స్వరూపముగ కృష్ణునకు నిత్యదాసుడు. కృష్ణ దాస్యమే వాని స్వరూపధర్మము. ఆ స్వరూప ధర్మరహితులు, స్వసుఖపరులు, కృష్ణ విముఖులగు జీవులను దండించుటకు భగవానుని మాయాశక్తి వారిని సత్వరజస్తమో గుణములను సంకెలతో బంధించుచు స్థూల లింగ శరీరములచే జీవుని స్వరూపమును గప్పివేసి, దుఃఖ పూర్ణములగు కర్మ బంధనములలో తగుల్కొన జేయుచు వారిని స్వర్గనరకములలో త్రిప్పుచూ నుండును.

7. ముక్త జీవుడు మాయనుండి ముక్తుడగును.

యదాభ్రామం భ్రామం హరి రస గల ద్వైష్ణవ జనం
కదాచిత్సం పశ్యన్ తదను గమనే స్యాద్ రుచిరిహ ।
తదా కృష్ణావృత్యా త్యజతి శనకైర్మాయిక దశాం
స్వరూపం బిభ్రాణో విమల రస భోగం సకురుతే ॥

ప్రపంచమున ఉచ్చనీచయోనులలో తిరుగు మాయా బద్ధజీవులకు హరిరస మత్తులైన వైష్ణవుల దర్శనమైనప్పుడు వైష్ణవ మార్గమందాసక్తి కలుగును. కృష్ణ నామము ఉచ్చరించుచున్నచో మెల్లమెల్లగా వారికి మాయిక దశ తొలగిపోవును. జీవుడు క్రమముగ స్వస్వరూపమును పొందుచు విమలమగు కృష్ణ సేవారసము నాస్వాదించుటకు యోగ్యుడగును.

8. చిదచిదాత్మకమగు జగత్తంతయు శ్రీహరియొక్క అచింత్య భేదాభేద ప్రకాశము

హరేః శక్తేః సర్వంచిదచిదఖిలం స్యాత్ పరిణతిః
వివర్తం నో సత్యం శ్రుతిమితి విరుద్ధం కలిమలమ్ ।
హరేర్భేదాభేదౌశ్రుతి విహిత తత్త్వం సువిమలం
తతః ప్రేమ్ణః సిద్ధర్భవతి నితరాం నిత్యవిషయే ॥

చిదచిదాత్మకమగు జగత్ అంతయు కృష్ణ శక్తి పరిణతియే. వివర్త వాదము సత్యము గాదు. పైగా అది కలిమలము, వేదవిరుద్ధమతము. అచింత్యభేదాభేద తత్త్వమే వేద సమ్మతమగు విశుద్ధమతము. ఆ తత్త్వము వలననే నిత్య తత్త్వము పట్ల ప్రేమ సిద్ధించును.

9. భక్తియే ఏకైక సాధనము

శృతికృష్ణాఖ్యానం స్మరణనతి పూజావిధిగణాః
తథా దాస్యం, సఖ్యం, పరిచరణ మప్యాత్మనివేదనమ్ ।
నవా    న్యేతానీహ విధిగత - భక్తేరనుదినం
భజన్ శ్రద్ధాయుక్తః సువిమల రతిం వైస లభతే ॥

శ్రవణము, కీర్తనము, స్మరణము, వందనము, పాదసేవనము, అర్చనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము - అను ఈ తొమ్మిది విధములుగా నున్న వైధీభక్తిని ప్రతిదినము శ్రద్ధతో అను శీలనము చేయువారు విమలమగు కృష్ణ రతిని బొందును.

10. కృష్ణప్రీతి యొక్కటియే సాధ్య వస్తువు

స్వరూపావస్థానే మధురరసభావోదయ ఇహ
ప్రజే రాధా కృష్ణ స్వజన జన భావం హృదివహాన్ ।
పరానన్దే ప్రీతిం జగదతుల సంపత్సుఖమహో
విలాసాఖ్యే తత్త్వే పరమ పరిచర్యం ప లభతే ॥

సాధన భక్తి పరిపక్వావస్థలో జీవుడు తన స్వరూపమున నుండును. అప్పుడు హ్లాదినీ శక్తి ప్రభావముచే వారిలో మధుర రస భావము ఉదయించును. అనగా వాని హృదయములో వ్రజమునందలి శ్రీరాధాకృష్ణ పరిజనానుగతమగు భావముదయించును. క్రమముగ జగత్తులోని సంపత్సుఖములు విలాసాఖ్య పరమానంద తత్త్వ సేవ గూడా వానికి లభించును. దీనికంటె జీవుల కెట్టి అధిక లాభము లేదు.

ప్రభుః కః కోజీవః కథమిదమచిద్విశ్వమితి వా
విచార్యైతానర్థాన్ హరిభజన కృచ్ఛాస్త్ర చతురః।
అభేధాశాం ధర్మాన్ సకలమపరాధం పరిహరన్
హరేర్నామానన్దం పిబతి హరిదాసో హరిజనైః॥

కృష్ణుడెవరు? నేనెవరును? (జీవుడు). యీ చిదచిద్విశ్వమెట్టిది? ఈ విషయములను పరిశీలించి హరిభజన పరాయణుడు, శాస్త్ర విషయ కుశలుడగు వ్యక్తి అభేదాశను, అన్ని విధములగు ధర్మాధర్మములను, అపరాధములను విడచి సత్సంగమున నుండి తనను హరిదాసునిగా తలంచుకొనుచు పరమానందము ఆస్వాదించును.

ఈ దశమూలమొక అపూర్వమగు సుందర సంగ్రహము. శ్రీమన్మహాప్రభువు ఉపదేశములన్నియు యీ దశమూలములో యిమిడి యున్నవి.

దశమూలమహాత్మ్యము

సంసేవ్య దశమూలం వైహిత్వా విద్యామయం జనః।
భావ పుష్టిం తథా తుష్టిం లభతే సాధుసంగతః॥

అనగా ఈదశమూలమును పఠించిన జీవుని అవిద్య అను రోగము సమూలముగా నాశనమగును. అనంతరము అతడు సాధు సాంగత్యముద్వారా భావ పుష్టిని, తుష్టిని పొందును.

# భజన క్రమము

జగత్తునందలి సకలజీవులయెడ నపారమగు దయను నెఱపుచు శ్రీమహాప్రభువు విశుద్ధవైష్ణవ ధర్మము అనగా జీవునియొక్క నిత్యధర్మమును భారతదేశమునందంతటను ప్రచారిత మొనర్చెను. కొన్నిప్రదేశములకు తానే స్వయముగ పోయి యద్దానిని బ్రకటించెను. కొన్నికొన్ని ప్రదేశములకు ప్రచారకులనంపి ప్రకటించెను. ప్రచారకులకు మితిలేని శక్తి ననుగ్రహించి దేశములకు పంపెను. వారు ప్రేమబద్ధులయి కార్యసాధన మొనర్చిరి. విశుద్ధమగు నడవడికగల ప్రచారకుల చేతనే తప్ప ఇతరులచే విశుద్ధధర్మ ప్రచారము నిర్వహింప బడనేరదు.

శ్రీమన్మహాప్రభుని శిక్షామూల మెద్దియనిన కృష్ణప్రేమయే జీవుని నిత్యధర్మము. ఈధర్మ ధనమునకు నిత్యదూరుడై జీవుడుండ జాలడు. కృష్ణుని మరచుటచే గలిగిన మాయామోహమున జీవునికి అన్యవిషయానురాగము కలిగి క్రమముగ నాప్రేమ ధర్మము గుప్తప్రాయమై జీవాత్మయొక్క అంతఃకోశమున మఱుగుపడినది. ఇందువలననే జీవునికి సంసారదుఃఖము కలుగుచున్నది. మఱల సౌభాగ్య ఘటనాక్రమమున "నేను నిత్య కృష్ణదాసుడ"నను విషయము జీవునికెపుడు స్మరణకువచ్చునో, అపుడే ధర్మము పునరుదితమై జీవునికి స్వాస్థ్యప్రాప్తి సంభవించును.

ఈ సత్యవిషయమందు విశ్వాసమే జీవుని సకలమంగళములకు మూలము. సంసార క్షయోన్ముఖతగల ఒకానొక జీవునకు బహుజన్మ సుకృతి ఫలముగ స్వభావసిద్ధి విశ్వాసము ఉదయించును.

**కోన భాగ్యే కోన జీవేర్ 'శ్రద్ధా' యది హాయ ।**

**తబె సెఇ జీవ్ 'సాధుసంగ' కరయ ॥**

(శ్రీ చైతన్య చరితామృతము)

'శ్రద్ధ' అను శబ్దమునకు అర్థము దృఢమైన విశ్వాసము. 'కృష్ణభక్తి చేసినయెడల జీవుడు సమస్తకర్మలు చేసినవాడగుచున్నాడు' అను నట్టి దృఢనిశ్చయమునకే శ్రద్ధయని పేరు. భాగవతము నందీవిధముగ నిర్వచించబడినది -

యథాతరోర్మూల నిషేచనేన, తృప్యంతి తత్స్కంధ భుజోపశాఖాః ।
ప్రాణోపహారాచ్చ యథేంద్రియాణాం, తథైవ సర్వార్హణ మచ్యుతేజ్యా ॥
(భా. 4-31-14)

వృక్షమూలమును బాగుగా నీటితో తడపినచో దాని స్కంధములు, శాఖలు, ఉపశాఖలు, పత్రములు, పుష్పములు మున్నగునవి తృప్తి చెందును. ప్రాణముల కాహారమిడిన సమస్త ఇంద్రియములు తృప్తి చెందును. అట్లే శ్రీకృష్ణునొక్కనినే పూజించుట ద్వారా సర్వదేవతలను, పిత్రాది దేవతలను పూజించినట్లగును.

సుకృతి ఫలముగ గలిగిన యాత్మ ప్రసన్నత్వముచే నాత్మయొక్క నిత్యధర్మమునుండియే స్వతస్సిద్ధమగు శ్రద్ధ యుదయించుచున్నది. అట్లు దయించిన శ్రద్ధ జీవుడుపయుక్త సాధు సంగమునందుండి భజన పద్ధతి నవలంబించుటచే సర్వానర్ధ నాశ మగుచుండ క్రమముగ నిష్ఠగను, రుచిగను, ఆసక్తిగను బరిణమించి చివరకు భావము పర్యంతము ఉన్నతి లాభము నొందు చున్నది.

స్వతస్సిద్ధమగు శ్రద్ధ ప్రబలరూపమున జన్మించినయెడల జీవునికి రాగమార్గోపలబ్ధి కలుగును. మఱియాతనికి యుక్తితోగాని, విధితోగాని పనిలేక కృష్ణరతి రూపమగు భావమార్గమున నతడు నిర్భయముగ ప్రవర్తించును. ఆత్మోన్నతి సాధనమందు మిగుల సమర్ధుడై యుండును. ఒకవేళ శ్రద్ధ ప్రబలరూపమునగాక కోమలముగ నుదయించిన యెడల తక్షణమే సద్గురుసేవన మొనర్చి వాని యనుగ్రహము నొంద గలిగినచో నవశ్యముగ నాశ్రద్ధ ప్రబల మగును. శాస్త్ర విశ్వాసమును, గురువాక్య విశ్వాసమును శ్రద్ధా పరిచయ లక్షణములగుచుండ శాస్త్రవిచారమువలన సాధారణముగ నెంతటి ప్రయోజనము గలదో వేఱుగ జెప్పవలసిన పనిలేదు.

కావున శాస్త్రవిచారము వలన శ్రద్ధా పుష్టి, దానివలన శ్రద్ధకు క్రమముగ ఉన్నతి కలుగునని తెలియుచున్నది. ఇచట శాస్త్రమనగా వేదశాస్త్ర మొక్కటియే ప్రమాణముగాని కేవల తర్కాదిశాస్త్రము లెంతమాత్రమును ప్రమాణములు గానేరవు. శ్రీచైతన్య చరితామృతమందు శ్రీమన్మహాప్రభువు శ్రీ సనాతన గోస్వామికి శిక్షణనిచ్చునపుడు "స్వతఃప్రమాణ వేద ప్రమాణ శిరోమణి" యని శలవిచ్చిరి.

శ్రద్ధ కోమల శ్రద్ధయనియు, దృఢశ్రద్ధయనియు రెండు విధములు. దృఢశ్రద్ధ వలన నుదయించెడి భక్తి స్వభావసిద్ధముగ భావరూపమున నుండును. ఈవిషయము శ్రీమన్మహాప్రభుని యుపదేశము శ్రీశిక్షాష్టకమునందు సంపూర్ణ రూపమున నున్నది. కోమలశ్రద్ధ యొక్క యున్నతి క్రమమును శ్రీసనాతన గోస్వామి కిట్లు సెలవిచ్చి యుండెను. భాగ్యవశముచే శ్రద్ధ, శ్రద్ధవలన సాధు సాంగత్యము, సాధుసాంగత్యము చేయుచు శ్రవణ, కీర్తనలను చేయుటద్వారా సాధనభక్తి అనుష్టింపబడి దానివలన యనర్థనివృత్తి, నిష్ఠ, శ్రవణాదులందు రుచి, ఆసక్తి, తద్వారా భావము, ప్రేమ లభ్యమగును.

దృఢ శ్రద్ధగలవారికి శాస్త్రవాక్యములతో ప్రయోజనము లేదు. కోమల శ్రద్ధగలవారికి శాస్త్రవాక్య పాలనము, సాధుసంగము తప్పవేఱొండు గతి లేదు. కోమలశ్రద్ధ గలవారు దీక్షను స్వీకరించుట వలన నితాంత ప్రయోజనము కలదు. సద్గురు సన్నిధానమున శాస్త్ర సిద్ధాంత లాభమును, మంత్రగ్రహణమును బొంది గురూపదిష్ఠ మార్గమున నర్చనాది సాధనవిధానమును జేయఁగా జేయగా వారల శ్రద్ధకు క్రమోన్నతి కలుగును. సాధనకాలమందు దుష్టసాంగత్యమును చాల జాగరూకతతో త్యజించివలెను.

వేదము విపులమైనది. అందు కర్మాధికారుల గూర్చియు, జ్ఞానాధికారులు మున్నగువారిని గూర్చియు ననేక శాస్త్రీయ నియమములు సంగ్రహింపబడుటచే శుద్ధభక్తి యందు అధికారము గలవారిని గూర్చిన యుపదేశములను సులభముగ సంగ్రహించుట కవకాశములేదు. వేదముయొక్క మూలతాత్పర్యము వేదశాస్త్రము నందాయాస్థలములలో అభిధేయరూపమున వర్ణింపబడియున్నది. ఆమూల తాత్పర్యమును దేటఁబఱచుటకే సకల సాత్త్విక పురాణములును రచింపబడినవి. ఆ సాత్త్విక పురాణములలో శ్రీమద్భాగవతము సర్వశ్రేష్ఠమై వేదతాత్పర్యమును సాత్త్వికముగ వ్యాఖ్యానించుటయందు అద్వితీయమై యున్నది. కావున భాగవత శాస్త్రము, తదనుగత పాంచరాత్రాది తంత్రశాస్త్రములు గూడ ప్రమాణములుగనే పరిగణింపబడుచున్నవి.

వేదప్రతిపాద్య విషయములు మూడు. అవి సంబంధము, అభిధేయము మరియు ప్రయోజనము.

సంబంధము :- వస్తుత్రయమగు చిత్ (జీవ), అచిత్ (మాయ), ఈశ్వరులకు గల పరస్పర సంబంధమే సంబంధ శబ్దమునకు అర్థము. వాస్తవముగ కృష్ణుడే యేకమాత్ర వస్తువు. ఆవస్తువునకు చిత్‌శక్తి యనియు అచిచ్ఛక్తి యనియు రెండు శక్తులు గలవు. చిత్‌శక్తి పరిణామమే జీవజగత్తు, అచిచ్ఛక్తి పరిణామమే అచిజ్జగత్తు. భగవంతుని నుండి వచ్చినవి గావున ఈరెండు శక్తులు తమ ప్రభువగు భగవంతుని సేవ చేయుటయే వీటి కర్తవ్యము. కావున సంబంధ విచారముచే జీవునకు కృష్ణదాస్యము మరల ప్రాప్తించుటయే సంబంధ స్థాపనమని తెలియుచున్నది.

అభిధేయము :- అభిధావృత్తిచే (సహజార్థముచే) వేదశాస్త్ర మందేయర్థము లభ్యమగుచున్నదో అదియే మనము గ్రహింపదగినది. వేదశాస్త్రమందలి యదార్థమగు నర్థమే వేదశాస్త్ర అభిధేయము. ఆయథార్థమగు నర్థమును తెలిసికొనుటయే మనకు కర్తవ్యము. వేదములన్నిటిని మనము చక్కగ పరిశీలించినచో భగవద్భక్తియే వేదశాస్త్రమభిధేయమని స్పష్టపడకమానదు. కర్మ, జ్ఞానము, యోగము మున్నగునవి యభిధేయమున కవాంతర సంబంధము కలవిగ జెప్పనగును గాని ముఖ్య సంబంధము వానికెంత మాత్రమును లేదు. కనుక నీ శాస్త్రమునందు కృష్ణప్రాప్తికి సాధనభక్తియే ముఖ్యోపాయముగ జెప్పబడుచున్నది.

ప్రయోజనము :- దేనినుద్దేశించి సాధనోపాయ మవలంబింపబడుచున్నదో అదియే ప్రయోజనము. జీవునకు భగవత్ప్రేమ సిద్ధియే ప్రయోజనము.

ఈప్రణాళిక ననుసరించియే శ్రీమన్మహాప్రభువు జీవుని ధర్మమును లోకమునకు అనుగ్రహించెను.



శ్రీల భక్తి సిద్ధాంత సరస్వతీ గోస్వామి ప్రభుపాదులు

# శ్రీల భక్తి సిద్ధాంత సరస్వతి గోస్వామి ప్రభుపాదులు

శ్రీల భక్తివినోద ఠాకూర్ మహోదయులు శ్రీ చైతన్యమహాప్రభువుల యొక్క అమూల్యమైన సిద్ధాంతములను పండిత, పామరులకు సులభమగు రీతిన తెలియజేయుటకు సరళమైన భావముతో వివిధభాషలందు పెక్కు గ్రంథములను రచించిరి. వారు వ్రాసిన గ్రంథములలో 'శ్రీచైతన్యశిక్షామృతమను' పేరొందిన గ్రంథమునందు "ఈ భక్తి ప్రచారోద్యమము అచిరకాలముననే భగవద్దత్త శక్తియుక్తుడగు నొక మహా పురుషునిచే ప్రపంచము నందంతటను ప్రచారమొనర్పబడునని" భవిష్యద్వాణిని సూచనగ తెలియజేసిరి. శ్రీల భక్తివినోద ఠాకూరులు రచించిన ఈగ్రంథములను, శుద్ధభక్తిని, దైవ వర్ణాశ్రమ ధర్మములను, శ్రీవిగ్రహసేవను లోకమున ప్రచారము చేయుటకు మరియు వీరి భవిష్యద్వాణిని ఋజువు చేయుటకు శ్రీల భక్తిసిద్ధాంత సరస్వతీ గోస్వామి ప్రభుపాదులు కంకణము కట్టుకొనిరి.

శ్రీల భక్తివినోద ఠాకూరు మహోదయులు డెప్యూటీ మెజిస్ట్రేటుగ ఉద్యోగము చేయుచు 'పూరి' క్షేత్రములోని శ్రీ జగన్నాథస్వామి వారి ఆలయమునకు దగ్గరలోని 'నారాయణ ఛాతా' అను గృహమునందు నివసించు చుండెడివారు. అచటనే క్రీ.శ. 1874, ఫిబ్రవరి 6వ తేదీన వీరి చతుర్ద కుమారుడుగ శ్రీల భక్తి సిద్ధాంత సరస్వతీ గోస్వామి ప్రభుపాదులు ఆవిర్భవించిరి. వీరు పుట్టుకతోనే మహాపురుషుల కుండవలసిన అన్ని సల్లక్షణములను, దివ్యాంగములను, యజ్ఞోపవీతమును, ద్వాదశ ఊర్ధ్వపుండ్ర తిలకములను కలిగి తేజోవంతముగ ప్రకాశించిరి. వీరిని చూచి భాగవతులు మహదానందముతో భగవన్నామ సంకీర్తనము చేసిరి.

ఒక పర్యాయము పూరీక్షేత్రమునందు శ్రీ జగన్నాథ దేవుల రథోత్సవము జరుగుచుండగ ఆరథము శ్రీల భక్తివినోద ఠాకూరుల ఇంటిముందు సుమారు మూడురోజులు ఆగిపోయినది. ఉత్సవ జనము క్రమముగ తగ్గి నిర్జనముగ ఉన్న సమయమున జగన్నాథ దేవుని దర్శించుటకు శిశుప్రభుపాదులను తల్లియగు

శ్రీభగవతీదేవి తోడ్కొని పోయినది. శిశు ప్రభుపాదులు జగన్నాథదేవుని పాదములను స్పృశించగా తన నిత్యదాసుడగు ప్రభుపాదుల మెడలో శ్రీజగన్నాథదేవుడు తన పుష్పమాలను ఆశీర్వాదముగ నుంచిరి. తరువాత రథము కదలినది. దీనిని బట్టి భగవంతుడు తన భక్తులయెడ చూపు అవ్యాజకరుణ తెలియుచున్నది.

శ్రీల భక్తివినోద మహోదయులు, శ్రీ భగవతీదేవి శ్రీ జగన్నాథ ఆలయము నందు గల శ్రీ విమలాదేవి ప్రసాదముతో శ్రీల ప్రభుపాదులకు అన్నప్రాశన గావించి, 'విమలాప్రసాద'ని నామకరణము చేసిరి. రుచి పరీక్షా సమయమున ధనము, బంగారము, ధాన్యము, కలము, శ్రీమద్భాగవతము మొదలగు వస్తువులనీ బాలుని ముందుంచగా వీరు శ్రీ మద్భాగవతమునే పట్టుకొనిరట. సాధారణముగ జీవులకు పూర్వజన్మలలో అభ్యాసమైన విషయలోలత్వము వైపునకే మనస్సు లాగివేయుచుండును, కాని మహనీయులకు వారి సంస్కారము నను సరించి చిన్నతనమునుండియే దైవోన్ముఖులను చేయును.

ఏడు సంవత్సరముల వయస్సులోనే శ్రీల ప్రభుపాదులు తండ్రిగారైన శ్రీల భక్తివినోద ఠాకూరుల వద్ద నృసింహ మంత్రోపదేశమును పొందిరి. ప్రహ్లాదుడు బాల్యకాలముననే శ్రీహరినామ మంత్రదీక్షనొంది, స్వయముగ ఆచరించి ఏ విధముగ నిర్భయముతో తమ సహచరులకు భక్తిమార్గమును భోదించిరో అటులనే వీరుకూడ మానవ జన్మ సార్థకతను గూర్చి ఇట్లు చెప్పిరి. "ప్రాజ్ఞులు దుర్లభమైన మనుష్య జన్మనొంది కౌమార వయస్సుననే భాగవత ధర్మానుష్ఠానము ప్రారంభింపవలయును. ఈ మానవజన్మము దుర్లభము, అనిత్యము, క్షణ భంగురము. కావున ఈ అల్పసమయముననందే భగవద్భక్తి నాశ్రయించిన యెడల సులభముగ జన్మ సార్థకము కాగలదు". కలకత్తానగరమున భక్తివినోదులు భక్తిభవనమును నిర్మించునపుడు భూగర్భముననొక శ్రీకూర్మవిగ్రహము దొరకినది. అప్పటినుండియు శ్రీల ప్రభుపాదులు తండ్రి ఆదేశానుసారము ఆకూర్మదేవుని పూజించి, ప్రార్థించుచుండిరి. చిత్తశుద్ధితో భగవత్సేవ చేయుటయే భజన. శ్రీల ప్రభుపాదులు పాంచరాత్రము, శ్రీమద్భాగవతములలో చెప్పబడిన అర్చన, భజన విధానములను తాము స్వయముగ జీవితములో ఆచరించి చూపిరి.

శ్రీల ప్రభుపాదులు క్రమక్రమముగ తల్లితండ్రులవద్ద అక్షరాభ్యాసము చేసి, ఏవిద్యచేత భగవంతునియందు భక్తి కలుగునో అట్టి ఉత్కృష్టమగు విద్యనే

అభ్యసించిరి. వీరు పాఠశాలలో విద్యనభ్యసించుచుండగనే క్రొత్తపద్ధతిలో శబ్దోచ్ఛారణ విధానమును కనుగొనిరి. ఈ నూతన శబ్దోచ్ఛారణ విధానమునకు 'బిక్రింత్' లేక 'బిక్రింట్' అను నామము ఏర్పడినది. సంస్కృత కళాశాలలో ప్రాచ్యశాఖయందు వ్యాకరణ శాస్త్రమును, మన్వాది స్మృతులందును, అలంకార శాస్త్రమందును, సాహిత్యదర్పణ సాంఖ్యాకారికాదులందును, పెక్కు భారతీయ దర్శనము లందును, జ్యోతిశ్శాస్త్రమునందును అసాధారణ నైపుణ్యమును చూపిరి. వారి జ్ఞాపక శక్తి మహాద్భుతమైనది.

వంగరాష్ట్రమందలి మేదినీపూర్‌లో ఒక పర్యాయము బ్రాహ్మణ-వైష్ణవ సభ ఏర్పాటు చేయబడినది. ఆసభయొక్క ముఖ్యోద్దేశము జన్మగత బ్రాహ్మణులే శ్రేష్ఠులా లేక గుణగత వైష్ణవులు శ్రేష్ఠులా అనునది సమస్త శాస్త్రప్రమాణముల ద్వారా నిర్ణయించుట. ఆ కాలమందు వైష్ణవ సమాజమున శ్రీల భక్తివినోద ఠాకూరులే ప్రధానముగ ప్రచారము గావించుచుండిరి. సభకు వందలాది బ్రాహ్మణ పండితులు చర్చించుటకు విచ్చేసిరి. వేలకొలది ప్రేక్షకులు కుతూహలముతో తిలకించుటకు వచ్చిరి. కాని దురదృష్టవశమున శ్రీల భక్తివినోద ఠాకూరులకు తీవ్ర అస్వస్థత కలిగినందువలన 'ఈ ప్రపంచమున వైష్ణవ సిద్ధాంతమును, వైష్ణవ శ్రేష్ఠత్వమును చాటిచెప్పు ధీరుడులేడ'ని బాధపడుతుండగ కేవలము పదునాలుగు సంవత్సరముల ప్రాయముగల శ్రీల ప్రభుపాదులు తన తండ్రికడకేగి "మీరాశీర్వదించి అనుజ్ఞనిచ్చినచో నేను ఆసభయందు వైష్ణవ శ్రేష్ఠత్వమును నిరూపించెదన"ని పలికిరి. శ్రీల భక్తివినోద ఠాకూరులు అత్యంతానంద పరవశులై దీవించి పంపిరి. ప్రభుపాదులా సభలో ప్రసంగించ నారంభించిరి. సభలోని వారందరూ ఆశ్చర్యముతో నింతటి అల్పవయస్సుగల తేజోవంతుడగు బాలకుని వాక్చాతుర్యమునకు ముగ్ధులై వినసాగిరి. ప్రారంభమున శ్రీల ప్రభుపాదులు శాస్త్ర ప్రమాణముల ద్వారా బ్రాహ్మణశ్రేష్ఠత్వమును, వారిలోని ద్వాదశగుణములను వర్ణించి, తదుపరి వైష్ణవ శ్రేష్ఠత్వమును, వారియందున్న 26 గుణములను శాస్త్రప్రమాణములతో వారి భక్తిని వర్ణించిరి. వీరి శాస్త్ర పాండిత్యమునకు, సిద్ధాంత పటిష్ఠతకు సభలోనివారందరూ ఆనందాశ్చర్యాన్వితులై వారికి "సిద్ధాంతసరస్వతి" అను బిరుదమునిచ్చి సత్కరించిరి.

శ్రీల ప్రభుపాదులు పాఠశాలలో చదువుచున్న కాలములో వీరి అన్నయగు శ్రీ అన్నదాప్రసాదు తీవ్ర అనారోగ్యమునకు పాలైరి. చికిత్సలకు స్వస్థత చేకూరలేదు.

విషమ పరిస్థితి ఏర్పడినది. ఒకరోజు సాయంకాలము పాఠశాలనుండి వచ్చిన తోడనే శ్రీల ప్రభుపాదులు స్నానాది కార్యక్రమములు ముగించి గం. 5.00 నుండి మరు నాటి ఉదయం గం.6.00 వరకు శ్రీ అన్నదాప్రసాదు దగ్గర కూర్చొని నిష్ఠతో హరినామజపమును చేయసాగిరి. వీరి జపప్రభావము వలన క్రమక్రమముగ అన్నగారికి బాహ్యజ్ఞానము కలిగినది. అతని నుదుటిపై రామానుజ సంప్రదాయపు తిలకము స్పష్టముగ కనిపింపసాగినది. అపుడు వీరు ప్రభుపాదులతో క్షమింపమని వేడుకొనిరి. వీరికి జప ప్రభావమువలన పూర్వజన్మ స్మృతి కలిగి, తాను పూర్వము రామానుజ సంప్రదాయ వైష్ణవుడననియు, ప్రభుపాదులు శ్రీల బలదేవ విద్యా భూషణులనియు, వారి పాదములయందు అపరాధము కలిగిన దనియు, తన సుకృతివలన ఈ జన్మలో పరమ భాగవతులగు శ్రీల భక్తివినోద ఠాకూరు మహోదయుల గృహమందు పుత్ర రూపమున జన్మించితిననియు తన పూర్వ పరిచయములనిచ్చి తనువు చాలించిరి.

అరువది నాలుగు భక్త్యంగములలో 'శ్రీ గురుపాదముల నాశ్రయించుట' మొట్టమొదటిది. సద్గురువు నాశ్రయింపనిదే ఎవ్వరికినీ యదార్థమగు పార మార్థిక మార్గము లభ్యముకాదు. కావున శ్రీలప్రభుపాదులు శ్రీల భక్తివినోద ఠాకూర్‌ల సలహామేరకు శ్రీల గౌరకిశోరదాస బాబాజీ మహారాజుల వద్ద దీక్షా మంత్రమును పొందుటకు వెడలిరి. మొదట శ్రీల గౌర కిశోర దాస బాబాజీ మహారాజు "నేను నీకు మంత్రోపదేశము చేయగలనో లేనో శ్రీ చైతన్య మహాప్రభువుల నడగకుండగ చెప్పలేన"నెను. రెండవ దినమున శ్రీల ప్రభుపాదులు శ్రీల బాబాజీ మహారాజు వద్దకు వచ్చిరి. అప్పుడు బాబాజీ మహారాజులవారు "నేను శ్రీమన్మహా ప్రభువులను అడుగుట మరచిపోయితిన"నెను. మూడవరోజు మరల శ్రీల ప్రభుపాదులు వచ్చినపుడు శ్రీల బాబాజీ మహారాజు 'నేను మహాప్రభువు నడిగితిని. సునీతి లేదా పాండిత్యము భగవద్భక్తి ముందు అతి సామాన్యమైనది' అనెను. అది వినిన శ్రీల ప్రభుపాదులు-"మీరు కపట చూడామణి యగు శ్రీకృష్ణుని సేవించుచున్నారు. కావుననే మీరు నన్ను వంచించి నాపై కృపచూపుటకు ఇష్టపడుటలేదు. శ్రీగోష్ఠీపూర్ణుల వద్దకు శ్రీరామానుజాచార్యులు పదునెనిమిది పర్యాయములు పోయివచ్చి చివరకు వారికృపను బొంది, దీక్షామంత్రమును పొందగలిగిరి. ఎవ్వరనూ శిష్యునిగ స్వీకరింపనని ప్రతిజ్ఞ చేసిన శ్రీలోకనాథ గోస్వామి వద్దనుండి శ్రీల నరోత్తమ ఠాకూర్ దైన్యముతోను, సేవా సౌశీల్యముతోను

వారిని మెప్పించి మంత్రదీక్ష నొందిరి. నేనును మీవద్దనుండి ఆవిధముగ ఒకానొకరోజున మంత్రదీక్ష నొందెదన"ని పలికిరి. శ్రీల ప్రభుపాదుల నిష్ఠకు ఆనందించి శ్రీల గౌరకిశోర్ దాస బాబాజీ మహారాజు మంత్రదీక్ష నొసగి "శ్రీవార్ష భానవీ దయిత దాసు"డను నామము నొసంగిరి.

శ్రీల భక్తివినోద ఠాకూరులు చివరిదశలో శ్రీల ప్రభుపాదులను పిలచి-- షడ్గోస్వాములు రచించిన గ్రంథములను, శ్రీచైతన్య మహాప్రభువుల శిక్షను, సర్వత్ర విశేషముగ ప్రచారము చేయవలసినదిగాను, శ్రీమన్మహాప్రభువుల జన్మస్థానము నున్నతి గావించుటకు, శ్రీ చైతన్య మహాప్రభువుల వాణిని, శ్రీనవద్వీప ధామ మహాత్మ్యమును అందరికి తెలియులాగున ప్రచారము గావింప నాదేశించిరి. శ్రీల ప్రభుపాదులు తల్లితండ్రుల ఆజ్ఞను శిరసావహించి నిర్వర్తించుటకు తీవ్ర ఉద్యమమును ప్రారంభించి శ్రీమాయాపూర్‌లో తీవ్ర వైరాగ్యముతో శతకోటినామ యజ్ఞమును ప్రారంభించిరి. ఆయజ్ఞానంతరము క్రీ.శ.1918 సం॥ ఫాల్గుణ పూర్ణిమనాడు శ్రీచైతన్యమఠమును స్థాపించి, శ్రీశ్రీ గురు, గౌరాంగ, గాంధర్వికాగిరిధారులను ప్రతిష్ఠించి వారిసేవను ప్రకాశము చేసిరి. ఆ భగవంతుని సమక్షమున ఆదినముననే సన్యాసమును స్వీకరించి "శ్రీల భక్తి సిద్ధాంత సరస్వతీ గోస్వామి మహారాజు"లుగ ప్రసిద్ధినొందిరి. పారమార్థిక గ్రంథముల ముద్రణకై శ్రీలప్రభుపాదులు అనేక ముద్రణాలయములను స్థాపించి ఎన్నియో గ్రంథములను రచించి ప్రకటించిరి. శ్రీచైతన్య చరితామృతమును అమృత ప్రవాహమను భాష్యముతోను, శ్రీమద్భాగవతమును సంపూర్ణముగ అన్వయ అనువాదములతోను, శ్రీమద్భగవద్గీతను శ్రీల విశ్వనాథ చక్రవర్తి టీకతోను, పెక్కు గ్రంథములను వంగభాషలోను, దైనిక, పాక్షిక, మాస పత్రికలను శుద్ధభక్తి ప్రచారమునకై వివిధభాషలందు ప్రచురించిరి.

శ్రీల ప్రభుపాదుల దివ్యవాణిలోని ముఖ్య అంశములనిట్లు పేర్కొనవచ్చును. అవైష్ణవ సంగముచేత సంసారము, లౌకిక ప్రవృత్తి పెరుగును. భగవద్భజన చేయుటకు సాధుసాంగత్యము చాల అవసరము. ఎల్లప్పుడు హరిగురు వైష్ణవుల సేవచేసినచో చిత్తశుద్ధి కలిగి సంసారమలము తొలగిపోవును. ఎవరు నిష్కామ బుద్ధితో ఫలితమునకైతొందర పడకకృష్ణనామమునునిష్కపటముగ జపింతురో

అట్టివారికి భగవంతుడు తప్పక ఫలితమిచ్చును. సంసారములో ఎట్టి సుఖమును లేదు. కష్ట సుఖములచే శాంతి, అశాంతులతో మనస్సు కల్లోలమగును. సంసార సుఖమునకై అర్రులు చాచువారు భగవంతుని మరచిపోవుదురు. మనయొక్క మనస్సును పరీక్షించుట కొరకై భగవంతుడీ ప్రపంచమును సృష్టించెను. సుఖమును కోరినచో భగవద్విస్మృతి కలుగును. అందువలన జీవుడు కష్టములనే కోరవలయును. ఏలననగా కష్టములందే భగవద్భజన సాధ్యమగును. భగవానుని శరణుబొంది కీర్తించువారికి శరీరము, మనస్సు, బుద్ధి ఈమూడును పరిశుద్ధ మగును. ఎవరిహృదయమును వారు భగవన్నికేతనముగ మార్చుకొనుటకు యత్నింపవలెను.

ఈ విధముగ శ్రీల ప్రభుపాదులు తమ అమూల్య ఉపదేశములను ఆచరణ పూర్వకముగ చూపి మాయాబద్ధుల ఉద్ధారమునకై అడుగడుగున ప్రయత్నించిరి. ఈ ప్రపంచమున సుమారు 63 సంవత్సరములుండి జగజ్జీవులను దుఃఖ సాగరమున విడచి 31-12-1936న నిత్యధామమగు గోలోకమునకు వెడలిరి.

# జీవస్వరూపము

"కే ఆమి, కేనే ఆమాయ యారే తాపత్రయ ।
ఇహానాహి జాని కేమనే 'హిత' హాయ ॥
సాధ్య సాధన తత్త్వ పుఛితే నా జాని ।
కృపాకరి సబ తత్త్వ కహత ఆపని ॥"

(తా॥ నేను అనగా ఎవరు? ఎందుకు తాపత్రయములు నన్ను పీడించుచున్నవి? నాకెట్లు మేలు కలుగునను విషయము నాకు తెలియదు. సాధ్యసాధన తత్త్వములను గూర్చి యడుగుట కూడ నాకు తెలియని విషయము. అందువలన మీరు నాపై దయ ఉంచి వీనినన్నింటిని గూర్చి చెప్పుడు.)

ఈ మాయిక జగత్తులోని ప్రాణులు తాపత్రయముచే జర్జరిత మగుచున్నవి. ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము - ఈ మూడును తాపములు. ఆధ్యాత్మిక తాపము రెండు విధములుగా ఉండును. జ్వరాది రోగములచే కలిగిన శారీరిక తాపము. ప్రియమైన వ్యక్తి వియోగము వలన కలిగినది మానసిక తాపము. జరాయు నుండి పుట్టిన ప్రాణుల వలన కలిగిన తాపము, గ్రుడ్డు నుండి పుట్టిన ప్రాణులవలన కలిగిన తాపము, చెమట నుండి పుట్టిన ప్రాణుల వలన కలిగిన తాపము, ఉద్భిజముల నుండి పుట్టిన ప్రాణుల వలన కలిగిన తాపము - ఇవన్నియు ఆధిభౌతిక తాపములు. శీతోష్ణములును, అతివృష్ట్యనావృష్ట్యాదులును, పిడుగు పడుట మున్నగు తాపములు - ఇంద్రాది దేవతల వలన కలిగినవి ఆధిదైవిక తాపములు. భీకరమైన స్వభావముగల యక్ష, పిశాచాదుల వలన కలిగిన తాపములు కూడ ఆధిదైవిక తాపములే. ఎందువలన తాపములు కలుగుచున్నవో, ఏమి చేసినచో అవి తొలగిపోవునో దానికి సమాధానము శ్రీచైతన్య మహాప్రభువు ఇట్లు చెప్పిరి.

జీవేర 'స్వరూప' హాయ కృష్ణేర 'నిత్యదాస' ।
కృష్ణేర తటస్థాశక్తి భేదాభేద ప్రకాశ ॥

పదిమంది లేక నూరుమంది భగవంతులు లేరు. ఆయన ఒక్కడే. మనము సూక్ష్మ స్వరూపము గలవారమై యున్నాము. కనుక బహిరంగ శక్తియగు మాయచే ఆవరింపదగిన వారలమై యున్నాము.

భగవంతుని అంతరంగ, బహిరంగ శక్తుల మధ్యస్థలమునందు తటస్థ శక్తి విరాజిల్లుచున్నది. అందులోనే జీవత్వోపాదానము ఇమిడియున్నది. జీవులు పరిమితములు, అసంఖ్యాకములు, చిన్మయములునై యున్నారు. జీవులతోపాటు గల అవిచ్ఛక్తి వృత్తిత్రయమగు త్రిగుణము, త్రిగుణజన్యమగు సంఖ్యాగత బహుత్వము, వస్తువుల పరిసర ప్రాంతము వారి వైశిష్ట్య సాధన సహాయము. అవిచ్ఛక్తి పరిణామ పరిచయ సామ్య ద్వారా జీవుల అసంఖ్యాకత్వము, అణుచిద్ధర్మమును కనగలము. బహిరంగశక్తి ధర్మము తటస్థశక్తి ధర్మములో నుండినను అంతరంగ చిచ్ఛక్తి వృత్తులై జ్ఞాతృత్వము, స్వతః కర్తృత్వము, భోక్తృత్వములు తటస్థశక్తి యందు కూడ విరాజిల్లుచున్నవి.

జీవుడు స్వరూపమున అణుచిత్తు అయియున్నప్పటికిని సంఖ్యలో అనంతులును, త్రిగుణములతోను సమ్మేళనము అగుటకు ఇష్టము గలవాడను అయి యున్నాడు. జీవుడు అణుచిత్స్వరూపుడు కనుక వానియందు అంతరంగశక్తి వృత్తిత్రయము అసంయతముగను, అవైధముగను నుండును. బహిరంగశక్తి గుణత్రయముతో కలిసికొనుట వలన వికారయోగ్యుడై యున్నాడు. అణు చిద్ధర్మ యుక్తుడగు జీవుడు బహిరంగశక్తియగు మాయచే విక్షిప్తమగుటకును అనగా భగవంతుని మరచిపోవుటకును యోగ్యుడు కాగలడు. అందువలన జీవుడు గుణమాయా భూమికలోను, భక్తి యోగమాయా భూమికలోను సంచరణ శీలుడై యున్నాడు. జీవుని సహజమైన వృత్తి సంవిదాశ్రితము అనగా కృష్ణదాసత్వము. ఆయన స్వరూపములో నున్నపుడు అవిచ్ఛక్తి పరిణతమై నట్టియు, నశ్వరమైనట్టి యునగు ఈ ప్రపంచములో సంవిద్వృత్తి పరిశీలనము నందు అనగా కృష్ణాను శీలనమునందు నిమగ్నమై యుండును. జీవుడు కృష్ణదా సత్వమును మరచిపోయి నప్పుడును, ఆయన స్వ స్వరూపానుభవము లేనప్పుడును క్రియాశక్తి లేనివాడై తటస్థ ధర్మమునందు విరాజిల్లుచుండును. భగవంతుని అచిచ్ఛక్తికి ఆధారమగు జడాకాశమునందు తన స్థూల ఉనికిని పరిశీలించినపుడు తన ఇంద్రియ సాహాయ్యముచే బహిర్వస్తు భోగరూపమగు జీవుని నైసర్గిక ధర్మము అప్పుడప్పుడు కావనగును. జీవుడట్టి పరిస్థితిలో ననుష్ఠించిన దానిని కర్మమని యందురు. కర్మ

జీవునకు అనాది ధర్మమై యున్నది. అది నశ్వర భూమిక యందు పరిశీలించుటకు అర్హత గలది కనుక వినాశయోగ్యమై యున్నది. కర్మము నందు ఆసక్తి గల కర్త (జీవుడు) వైదేశిక గుణత్రయాభిమానముచే తన చిద్ధర్మమును దుర్వినియోగము జేయును. జీవుడు సత్త్వగుణము నవలంబించు నపుడు ఆయనకు కొంచెము స్వరూప పరిచయము ఉండును గాని రజస్తమో గుణ మిశ్ర భావానుభవ క్రమమున కర్మాకర్మవికర్మములను జేయును. కర్త (జీవుడు) సత్త్వగుణావస్థితుడై రజస్తమో వృత్తి ద్వయములో కలిసికొనక యుండుటకు ప్రయత్నము చేయునపుడు సత్కర్మ నిపుణుడై సాత్త్విక భావమునందు ప్రతిష్ఠితుడై యుండును. జీవుడు గుణమాయ నతిక్రమించి పరమశాంతిని పొందుమార్గము కృష్ణుడు గీతలో నిట్లు నుడివెను :

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతితే ॥ "

భగవానుడు పలికెను : "సత్త్వాదిగుణవికారాత్మకమైన,అలౌకికమైన నామాయను దుర్బలుడగు జీవుడు జయించలేడు. కాని కేవలము నన్నే శరణుజొచ్చినవారు అట్టి మాయా సముద్రమును దాటగలరు."

మనకు 'స్వతంత్రబుద్ధి' అని మిక్కిలి వెలగల రత్నమొకటి కలదు. కాని అది భగవత్పర తంత్రమై యున్నది. మనము ఈ సిద్ధాంతమును తిరస్కరించి స్వతంత్ర బుద్ధిని దుర్వినియోగము చేయ తలంచునప్పుడే సర్వనాశనము కలుగును. మనము యుగయుగాల వరకు ఈ ప్రపంచమున ప్రాపంచికమైన వస్తువులను అభివృద్ధి పరచి మనకు గల సమస్యలను, లోటుపాట్లను సరిదిద్ద లేకున్నాము. అతిజ్ఞానము ప్రతియడుగున మనను మోసగించును. అందువలననే శ్రీమద్భగవద్గీతలో భగవత్పాదములను శరణుజొచ్చవలెనని మనకు శ్రీకృష్ణుడు ఎలుగెత్తి చెప్పెను. శ్రీకృష్ణుడే భగవద్వస్తువై యున్నాడు. అట్టి స్వయం భగవంతుని యందు శరణాగతి కలిగియుండుటయే ప్రతిజీవునకు ఏకైక లక్ష్యమై యున్నది. భగవత్పాదములకు సమర్పితాత్మ కాగలిగినచో మన జీవితములోని ఉద్దేశము లకును కర్తవ్యాకర్తవ్యమగు నిర్ణయమునకును, సమస్యలకును పరిష్కారము కలుగును.

# శ్రీ గురుతత్త్వము

వేదములలోను, ఉపనిషత్తులలోను, శ్రీమద్భాగవతములోను మరియుననేక ఇతర శాస్త్రీయ గ్రంథములలోను, పవిత్రులైన వ్యక్తుల యుపన్యాసములలోను శ్రీగురుదేవుడు (ఆధ్యాత్మిక బోధకుడు) అనేక విధములుగా ప్రశంసింపబడినాడు. ఉపనిషత్తు ఇట్లు చెప్పుచున్నది. "ఆ అఖండ సత్యమును తెలిసికొనుటకు గురుదేవుడను వ్యక్తినుండి సాహాయ్యమును కోరవలెను". ఛాందోగ్యోపనిషత్తులో: "తన శిష్యునకు అఖండ సత్యమును తెలియజేయువాడే గురువని" వర్ణింపబడినది. గురుకృపవలననే, భౌతిక సంబంధ పాశముల నుండి మానవుడు తప్పించుకొన గలడు. 'తమేవ విదిత్వా అతిమృత్యుమేతి' ఇదియే సత్యము. ఎవరైతే తన శిష్యునిలో ఆత్మసత్య విజ్ఞానమును ప్రవేశపెట్టునో, అతనిని ప్రాపంచిక మాయా పాశముల నుండి తప్పించునో అతడే గురుదేవుడు. ఈ ప్రపంచమొక కత్తియొక్క పదునైన యంచు వంటిది. అది మానవుని దుఃఖము వైపు, విషాదములవైపు ఎల్లప్పుడు లాగికొనిపోవును. దీనినుండి తప్పించుకొనుటకు గురుపాద పద్మా శ్రయమే కర్తవ్యము. ఎందుచేతననగా వైదిక రహస్యము ఇట్లున్నది:

"యస్యదేవే పరాభక్తి ర్యథా దేవే తథా గురౌ "

దేవుని సేవకును, గురుసేవకును ఎవని జీవితమంకితమైనదో, అతనికి శ్రుతులలోని సత్యము అవగాహనమగును.

ప్రకృతిలోని సర్వ సంపూర్ణత్వమే మానవుడు. అతని నిర్మాణము మూడువిధములుగా నున్నదనవచ్చును. అవి శారీరికము, మానసికము, ఆధ్యాత్మికము. సత్త్వరజస్తమో గుణములతో నిండిన వ్యక్తిత్వము ఏర్పడుటకు ఇవి దోహదము చేయును. వ్యక్తిత్వము అనగా సేవాభావమే. ఒక వ్యక్తి స్వయం సంపూర్ణుడు అగుటకు, సాత్త్విక శాస్త్రపఠన మావశ్యకము. అపుడు అతడు గురుదేవుని శిక్షణతో ఆధ్యాత్మిక విషయములను గ్రహించును. దానికి బద్ధుడగును. కాని, కొందరి విషయములలో ఆ విజ్ఞానము దోషరహితము కాకుండుటచే, ఒక విధమైన గర్వమును, స్వాతిశయమును వారిలో రేకెత్తించును. ప్రాపంచిక విషయ వాసనల జోలికి పోవును. ఈ మూడు గుణముల శక్తివలన ప్రాపంచిక విజ్ఞానము మాత్రము వికసించును. వాటి బలము ఎక్కువైనకొలది వారు అంతకంతకు

ప్రాపంచిక దుఃఖములకు లోనౌదురు. చివరకు బాధా విమోచనమునకు గురుదేవుని జేరుదురు.

విద్యా సంపాదనకు గ్రంథ మావశ్యకము. ఈ విద్య రెండు రకములు : పరావిద్య మరియు అపరావిద్య. "సా విద్యా తన్మతిర్యయా" - దైవభక్తిని కలిగించునదియే నిజమైన విద్య. పరావిద్యను మన పూర్వులైన ఋషులు శిష్యులకు అందించిరి.

"తద్విజ్ఞానార్థం సగురుమే వాభిగచ్ఛేత్ '' అట్టి గురువును సంపాదించుట కొరకు వెళ్ళవలెను. అతడు సమీపించును, అతని వలన ఆధ్మాత్మిక విజ్ఞానమును సంపాదించుటకు ప్రయత్నించును. అపరావిద్య అనగా ప్రాపంచిక విషయములను తెలుపునది. పరావిద్య అనగా భగవంతునితో సంబంధమును పెట్టుకొనునది. అట్టి పరావిద్య సేకరణకై వెదకుకొనవలసిన గురువు సర్వశాస్త్రవేత్తయై యుండవలయును. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములకు లోబడని వాడు, "శ్రోత్రియం బ్రహ్మ నిష్ఠం" అయిన గురువు అవసరము. భగవత్సాక్షాత్కారమునకు కామ క్రోధాదులు ఆరు బహుళాటంకములుగా నున్నవి. అందుచేత గురువు బాధ్యతలు రెండు : దీక్షా గురువు, బోధగురువు - అవి మామూలు అర్థములో ఒకటిగా కన్పించుచున్నప్పటికి వాని ధర్మ నిర్వహణములో అవి రెండుగానేయున్నవి.

అకించభక్తి, అభిధేయ భక్తి కలిసిపోయినచో, కృష్ణభక్తుల సంసర్గమునందు అభిలాష మానవునకు కలుగును. శ్రీకృష్ణుని యెడల గల శ్రద్ధవలననే, ఆయన స్వరూప సందర్శనము మీద అభిలాష కలుగును. కృష్ణభక్త సంసర్గము వలన ఇది సాధ్యమగును. అయితే శ్రీకృష్ణుని గొప్పతనమును తెలిసికొనవలెనను కాంక్ష కలవారు, ఒక గురువు నుండిగాని, ఇద్దరు గురువుల నుండి కాని ఆ భగవానుని యొక్క నామ, కీర్తి స్వభావ లీలలను గురించి నేర్చుకొనవలెను. రాగాత్మికా భక్తియే దీనికి మార్గము. కాని ప్రారంభదశలో గురుశిక్షణ కావలెను. 'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా', ఆ భగవద్విజ్ఞానమును గురు నమస్కారము ద్వారా, ఉత్తమ ప్రశ్నల వలన, సేవవలన రాబట్టవలెను.

దీక్షా గురువు ఒక్కరు మాత్రమే యుండును. దీక్షవలననే భగవత్సాక్షాత్కారము పొందుటకు వీలగును. సత్యాన్వేషకుడు ఈ విషయమును గ్రహించి

గురుపాదాశ్రయము చేయవలయును.గురుసేవా పరాఙ్ముఖునకు గురుసాక్షాత్కారము హుళక్కియే యగును. గురుసేవా సౌకర్యము లేనివారు పడవ లేకుండ సముద్ర తరణము చేయదలచువారితో సమానులు. ప్రాపంచిక మాయావాద గురువుల నుండి వారు తప్పించుకొనజాలరు.గురుదేవుని యెడల ఐకాంతిక భక్తి వలననే శ్రీకృష్ణ కృప లభ్యమగును. గురువు కంటె నేనే ఎక్కువ తెలిసినవాడను అని ఎవరనుకొందురో వారికి కృష్ణ కరుణ ఆకాశపుష్పమే. సంప్రదాయగురు సేవకంటె ఆధ్మాత్మిక గురుసేవ ఉత్తమ తరము.

శ్రీ గురుదేవుడు ఆధ్యాత్మిక సలహాదారుడు కూడ అగును. ఎవరు శాస్త్రార్థములు క్షుణ్ణంగా తెలిసికొని శాస్త్రీయ క్రియలందు గౌరవముంచుదురో, ఇతరులకు కూడ ఆ విషయముల యందు క్రమబద్ధమైన ఆసక్తిని కలుగజేయుదురో వారిని ఆచార్యులందురు.

భగవంతుడే ఆచార్యుని రూపముతో శిష్యునకు కన్పించును. ఆచార్యుడు శిష్యునకు ఆశ్రయమైనాడు. భగవత్సేవ లేకుండ ఎవరైన 'ఆచార్యుని'గా తలంచినచో అది ప్రజలలో చెలామణి కానేరదు. ఆచార్యదేవుని కీర్తిని చూచి ప్రాపంచిక సుఖ విరాగి అసూయచెందును. ఆచార్యదేవుడు భగవత్స్వరూపమనుట అతనికి అనంగీకారమే, తత్ఫలితముగా అతడనేక బాధలకు లోనగును.

శ్రీగురుదేవుడు కూడ శ్రీచైతన్యుని సేవకుడైనప్పటికి, ఉత్తమ శిష్యునకు భగవంతుని స్వరూపముగా కన్పించును. శ్రీచైతన్య దేవునకు వ్రజేంద్రనందనునకు ఎట్టి వ్యత్యాసము లేదు.

శ్రీల రఘునాథదాసగోస్వామి గురుదేవుని గురించి ఇట్లు నుడివిరి - "ముకుంద ప్రేష్ఠత్వే గురువరం స్మర" ముకుందుని యొక్క ప్రియతముడుగా గురుదేవుని జ్ఞప్తి యందుంచుకొనుము : శ్రీల జీవగోస్వామి "భక్తి సందర్భ" మను గ్రంథములో 213వ శ్లోకములో ఇట్లు వ్రాసిరి :

**"శుద్ధభక్తాస్త్వేకే శ్రీగురో శ్రీ శివస్యచ భగవతా**
**సహాభేద దృష్టిం తత్ప్రియత మత్వేనైవ మన్యన్తే."**

శాస్త్రములలో శ్రీ గురుదేవుడు, శివుడు భగవంతునితో సమానమని చెప్పబడినది. కాని శుద్ధభక్తులు వారిని కృష్ణప్రియతములని అనుకొనుచున్నారు.

శ్రీ గురుదేవుడు శ్రీహరి యొక్క అవతారమని నుడివిరి. (సాక్షాత్ హరిత్వేన) పవిత్రులు కూడ అట్లే అనుకొందురు. "భావ్యత ఏవసద్భిః".

గురువు శ్రీహరికి ఆప్తుడని అందరు గౌడీయ వైష్ణవులు తలంతురు. పురాతన సంప్రదాయ ప్రార్థనలలోగాని, నిర్దుష్టమైన భక్తి గేయములలోగాని గురుదేవుడు రాధాదేవికి విశ్వాసపాత్రుడుగాను, శ్రీనిత్యానందుని సహచరుడుగాను పరిగణింప బడుచున్నాడు.

శ్రీహరిని ఎట్లు సేవింపవలెనో ఎవరు బోధించుదురో వారు మతగురువగు చున్నారు. అట్టివారు రెండు తెగలుగా ఉందురు. అంతరాత్మ పరిశోధకులుగా నుండువారు కొందరుందురు. వారిని "చైత్యగురు" వందురు. తమ చర్యల ద్వారా ఎట్లు దైవసేవ చేయవలెనో చెప్పువారిని "మహంతగురువు" అందురు. భజన ఆయా సంప్రదాయ పద్ధతులుగా నుండును. భగవత్కృప కొరకు శిష్యుని తయారుచేయు శ్రీగురుదేవుడు కృష్ణసంబంధ విజ్ఞానమును బోధించును. దీక్షాగురువు ప్రేమ సంపాదించిన శిష్యుడు ఆధ్యాత్మిక గురువు దగ్గర నేర్చుకొనిన దానిని 'అభిధేయ విజ్ఞాన' మందురు. అందుచేత ఇద్దరు గురువులకు తేడా లేదు. నామికి, నామమునకు వ్యత్యాసము లేదు. దీక్షాగురువు తన శిష్యుని శ్రీగోవిందుని పాదపద్మముల చెంతకు తోడ్కొనిపోవును. ఆ గోవిందుడు 'అభిధేయ దేవుడు' అనబడును.

# పాంచరాత్రిక అధికారము

వైష్ణవులు వేరు వేరు కాలమునందు వేఱు వేఱు దేశములందు నానా విధములైన నామములతో పరిచితులు. ఒక చరిత్రకారుడు వారిని పంద్రెండు శ్రేణులుగ విభజించెను. అవి : సాత్వతులు, భక్తులు, భాగవతులు, పాంచరాత్రికులు, వైఖానసులు, కర్మహీనులు, అకించనులు, సాంప్రదాయికులు మొదలైనవి వైష్ణవులకు నామాంతరములని కీర్తింపబడుచున్నవి. నిర్విశేషవాదుల కనుచరులైన పంచదేవోపాసకులలోగాని Theosophist లలో గాని వైష్ణవులని పరిచయ మిచ్చువారు అనేకులు గలరు. చివర చెప్పిన పంచదేవోపాసకులు నిర్విశేషమతమును అంగీకరించి వైష్ణవ మతము నుండి చ్యుతులగుదురు.

వైష్ణవులు వేఱు వేఱు శ్రేణులలో విభజింపబడినను స్థూలముగా వారిలో రెండు ప్రబలమైవిభాగములుకాననగును. అర్చన మార్గముననుసరించు వైష్ణవులు పాంచరాత్రికులనియు, భావమార్గముననుసరించు వైష్ణవులు భాగవతులనియు పేర్కొనబడును. శ్రీమహాప్రభు మతమున శ్రీ భాగవత పాంచరాత్రిక వైష్ణవులలో అనుష్ఠానికగతమైన భేదము కనపడినను ఉభయులు భగవద్భక్తులే. పంచరాత్ర భాగవతములు ఈ ఉభయ మతముల శుద్ధభక్తికే ఉద్దేశించెను. ఈ విషయమును గురించి శ్రీచైతన్య చరితామృతము 2-19-168 పద్యము నందు ఇట్లున్నది.

"ఏ ఇ శుద్ధ భక్తి, ఇహా హఇతే ప్రేమా హయ ।
పంచరాత్రే భాగవతే ఏ ఇ లక్షణ కయ ॥

తా ॥ శ్రీచైతన్య మహాప్రభువు శ్రీల సనాతన గోస్వామితో శుద్ధభక్తి లక్షణములు చెప్పి - "ఇదే శుద్ధభక్తి దీనివలననే కృష్ణప్రేమ కలుగును. పంచరాత్రమును భాగవతమును దీని లక్షణములు చెప్పుచున్నవ"నిరి.

పంచరాత్ర శబ్దమునకు అర్థము 'పంచజ్ఞాన విషయిక పద్ధతి', 'రా' ధాతు యొక్క అర్థము దానము చేయుట. పంచవిధములైన జ్ఞానము గూర్చి చెప్పబడిన శాస్త్రమును పంచరాత్రమని చెప్పబడును. జ్ఞానవచనమే రాత్రము.

జ్ఞానము పంచ విధములు. అందువలననే పండితులు ఆ శాస్త్రమును పంచరాత్రమని యందురు.

"రాత్రంచ జ్ఞాన వచనం జ్ఞానం పంచవిధం స్మృతమ్ ।
తేనేదం పంచరాత్రం చ ప్రవదంతి మనీషిణ : ॥"

(నారద పంచరాత్రము 1-1-44)

మొదటిది - సాత్త్వికజ్ఞానము, రెండవది - నిర్గుణజ్ఞానము, మూడవది - సర్వపరజ్ఞానము, నాల్గవది - రాజసికజ్ఞానము, ఐదవది - తామసికజ్ఞానము. రాజసికజ్ఞానము భక్తులు పొందదగినది కాదు. తామసికజ్ఞానము పండితుల కిష్టమైనది గాదు.

శ్రీరామానుజ శిష్యుడైన కురేశుని కుమారుడు పరాశరభట్టుడు. పరాశరుని శిష్యుడు వేదంది. వారి శిష్యుడు నంబురు వరదరాజు. వారి శిష్యుడు పిల్లాఇలోకాచార్యుడు. ఆయన అర్థపంచకమను ఒక గ్రంథమును రచించిరి. ఇందు జీవ స్వరూపము, ఈశ్వర స్వరూపము, పురుషార్థ స్వరూపము, ఉపాయ స్వరూపము, విరోధి స్వరూపముల గూర్చి చెప్పబడినది. ఈ పంచరూప స్వరూప జ్ఞానము మరల ఐదేసి భాగములు చేసి మొత్తము ఇరువదియైదు అర్థములను చెప్పబడియున్నది.

శ్రీమధ్వ మతమున వస్తువును గూర్చి పంచభేద జ్ఞానము వర్ణింపబడినది. అవి ఇవి : ఈశ్వర జీవులలో భేదము, జీవులలో భేదము, ఈశ్వర జడములలో భేదము, జడములో భేదము, జీవజడములలో భేదము. ఈశ్వరుడు, జీవుడు, ప్రకృతి, కాలము, కర్మము ఈ పంచ విషయక జ్ఞానముచే పురుషార్థ జ్ఞానము లభించును.

పంచమహా భూతములు, పంచ సూక్ష్మభూతములు, పంచ జ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు దీనిపై మనస్సు, బుద్ధి, అహంకారము, ప్రకృతి, పురుషుడు ఈ పంచ విషయిక శుద్ధ జ్ఞానము కూఢ పంచరాత్రమే. నిర్విశేషమతాను గతమగు ఆగమశాస్త్రమును గూడ పంచోపాసకులు పంచరాత్రమని ఆఖ్యానింతురు.

బ్రహ్మ, శైవ, కౌమార, వాశిష్ఠ, కపిల, గౌతమీయ, నారదీయ అని పంచరాత్రములు ఏడని నారదీయ పంచరాత్రమున వర్ణింపబడినది. ఐదు పంచరాత్రములలో శ్రీకృష్ణమహాత్మ్యము వర్ణింపబడినదని బ్రహ్మ వైవర్త పురాణములోని కృష్ణజన్మఖండమున 123 వ అధ్యాయములో చెప్పబడినది.

వాశిష్ట, నారదీయ, కపిల, గౌతమీయ, సనత్కుమారీయ ఈ ఐదు సాత్త్విక పంచరాత్రములు. ఇవియేకాక హయశీర్ష, పృథు, ధృవ మొదలగు పంచరాత్రములు గూడ గలవు. శ్రీగౌడీయ వైష్ణవులలో గూడ 'శ్రీగౌరాంగ, నిత్యానంద, అద్వైత, గదాధర, శ్రీవాసాది భక్త బృంద' ఈ పంచతత్త్వములకు అర్చనము జరుగు చుండును.

పంచరాత్రికులు జేయు అనుష్ఠానములు ఆగమశాస్త్రమును అనుసరించి యుండును. అందువలన పాంచరాత్రికులు అర్చనపరులు. అర్హతలేనివారు సాధన ప్రభావముచే నర్హత పొందుదురు. యోగ్యవ్యక్తులే వైదిక పద్ధతిని అనుష్ఠింతురు. నారదాది పంచరాత్రములకును, వేదశాస్త్రము యొక్క సుపక్వ ఫలమైనట్టి శ్రీమద్భాగవతమునకును ఉద్దేశ్యమొకటియైనను అనుష్ఠాన భేదము ఏకగ్రీవంగా గ్రహింపవలెను.

భాగవతులవలె అర్చనపర వైష్ణవులకధికారము ముప్విధములని శాస్త్రములలో చెప్పబడినది. అర్చనపరులైన కనిష్ఠ వైష్ణవ లక్షణములను గూర్చి శాస్త్రమిట్లు చెప్పుచున్నది.

**శంఖచక్రా ద్యూర్ధ్వ పుండ్రధారణా ద్యాత్మ లక్షణమ్ ।**
**తన్న స్కరణంచైవ వైష్ణవత్వ మిహోచ్యతే ॥**

(భక్తి సందర్భము -201 సంఖ్యాధృత పద్మపురాణవ్యాఖ్య)

తా॥ శంఖము, చక్రము, గద, పద్మము మొదలగువాని చిహ్నములను ధరించి లలాటము మొదలగు పై ద్వాదశాంగములలో నామములను ధరించి ఆ నామమనెడు విష్ణుమందిరములకు నమస్కారము జేసినచో దానివలన జీవులకు వైష్ణవత్వము కలుగును.

అర్చనపరులైన మధ్యమ వైష్ణవ లక్షణములను గూర్చి శాస్త్రములు ఇట్లు చెప్పుచున్నవి.

**తాపః పుండ్రం తథానామ మంత్రో యాగశ్చాపంచమః ।**
**అమి పంచైవ సంస్కారాః పరమైహేతవః ॥**

(భక్తి సందర్భము -204 సంఖ్యాధృత పద్మపురాణవ్యాఖ్య)

తా॥ తాపము, పుండ్రము, నామము, మంత్రము, యాగము ఈ పంచ సంస్కారములతో గూడిన వారై యుండినచో వైష్ణవులు పరమ ఐకాంతిక మహాభాగవతులగుట కర్హులు కాగలరు అనగా మధ్యమ వైష్ణవ పదవి పొందుదురు.

అర్చనపరులైన ఉత్తమ వైష్ణవ లక్షణములను గూర్చి శాస్త్రమిట్లు చెప్పుచున్నది.

**తాపాది పంచసంస్కారీ నవేజ్యైకర్మ కారకః ।**
**అర్థ పంచ కలిదే విప్రో మహాభాగవతః స్మృతః ॥**

(భక్తి సందర్భము -198 సంఖ్యాధృత పద్మపురాణవ్యాఖ్య)

తా ॥ తాపము, పుండ్రము, నామము, మంత్రము, యాగము ఈ పంచ సంస్కారము గల మధ్యమ వైష్ణవ బ్రాహ్మణులు తొమ్మిది విధములైన ఇజ్యాకర్మములను సంపాదించి అర్థ పంచకములందు నిపుణత పొందినచో వారు మహాభాగవతులని చెప్పబడుదురు. అపుడాయన పాంచరాత్రిక దీక్షనిచ్చు గురువగుటకు సమర్థులగుదురు.

గురులక్షణములను గూర్చి శాస్త్రములలో ఇట్లు చెప్పబడినది.

**ఆవదాతాన్వయ : శుద్ధః స్వోచితాచార తత్పరః ।**
**ఆశ్రమీ క్రోధరహితో వేదవిత్ సర్వశాస్త్రవిత్ ॥**
**ధీమాననుద్ధతమతిఃపూర్ణో హంతా విమర్శకః ।**
**సుగుణోర్చాసుకృత ధీః కృతజ్ఞః శిష్యవత్సల : ॥**

(హః:భః:విః 1/38,40 సంఖ్యాధృత మంత్రముక్తావళీవచనము)

**దేవతోపాసకః శాంతో విషయేష్వపి నిస్పృహః ।**
**అధ్యాత్మవిద్ బ్రహ్మవాదీ వేద శాస్త్రార్థ కోవిద : ॥**
**ఉద్ధర్తుం చైవ సంహర్తుం సమర్థో బ్రాహ్మణోత్తమః ।**
**తపస్వీ సత్యవాదీ చ గృహస్థో గురురుచ్యతే ॥**

(హః:భః:విః 1/42,43 సంఖ్యాధృత అగస్త్య సంహితావచనము)

తా॥ ఎవరి వంశములోని పూర్వీకులుగాని, తాను స్వయముగాగాని పతితులుకారో తన విహిత ఆచరణములందు రతులై యున్నారో ఆశ్రమధర్మము చక్కగ పాటించుచున్నారో, క్రోధహీనులో, వేదవిత్తో, సర్వశాస్త్ర పారంగతులో, ధీమంతులో, స్థిరమతి గలవారో, పూర్ణులో, అహింసకులో, వివేకము గలవారో, వాత్సల్యాది గుణవంతులో, భగవత్పూజ యందు దృఢబుద్ధి గలవారో, కృతజ్ఞులో, శిష్య వత్సలురో, దేవోపాసకులో, శాంతులో, విషయములందు స్పృహలేనివారో, ఆధ్యాత్మ తత్త్వవేత్తలో, బ్రహ్మవాదులో, వేదశాస్త్రార్థ విశారదులో, మంత్రోద్ధర సంహారము లందు సమర్థులో, బ్రాహ్మణ శ్రేష్ఠులో, తపస్సు యందు ఆసక్తి గలవారో, సత్యవాదులో అట్టి గృహస్థులు గురువగుటకు అర్హులు.

బ్రాహ్మణః సర్వకాలజ్ఞః కుర్యాత్సర్వేష్వనుగ్రహమ్ ।

(హ:భ:వి: 1/35 సంఖ్యాధృత నారద పంచరాత్రవ్యాఖ్య)

తా ॥ సర్వకాలజ్ఞ బ్రాహ్మణుడు అన్ని వర్ణములలోని వారిని అనుగ్రహించవలెను.

మహాభాగవత శ్రేష్ఠో బ్రాహ్మణోవై గురుర్నృణామ్ ।
సర్వేషామేవ లోకానామసౌ పూజ్యో యథా హరిః ॥

(హ:భ:వి 1/53 సంఖ్యాధృత పద్మపురాణ వచనము)

తా॥ మహాభాగవతులు, భగవన్మాహాత్మ్య వేత్తా బ్రాహ్మణులే లోకములకు గురువు. వారే అన్ని లోకములలో హరి వలె పూజ్యులు.

మహాకుల ప్రసూతోఽపి సర్వయజ్ఞేషు దీక్షితః ।
సహస్ర శాఖాధ్యాయీ చ నగురుః స్యాద వైష్ణవః ॥
గృహీత విష్ణు దీక్షాకో విష్ణుపూజా పరో నరః ।
వైష్ణవోఽభిహితోఽభిజ్ఞైరితరోఽస్మాదవైష్ణవః ॥

(హ.భ.వి. 1/40,41 సంఖ్యాధృత పద్మపురాణ వచనము)

గొప్పకులములో జన్మించినప్పటికి, సర్వ యజ్ఞములలో దీక్షితులై యున్నప్పటి కిని సహస్ర శాఖాధ్యాయీ బ్రాహ్మణుడై యున్నప్పటికిని వారు అవైష్ణవులై యుండినచో గురుపదవి పొందనర్హులు కారు. ఏ వ్యక్తి విష్ణుమంత్ర దీక్ష

పొందినారో, విష్ణుపూజా పరాయణులో అట్టివారే వైష్ణవులని చెప్పబడును. తతిమ్మా ఇతరులందరు అవైష్ణవులని చెప్పబడును.

శ్రీలజీవగోస్వామి భక్తి సందర్భములో నవేజ్యా కర్మమును గూర్చి ఇట్లు ఉదాహరణమిచ్చిరి.

**అర్చనం మంత్ర పఠనం యోగోయోగో హి వందనమ్ ।**
**నామ సంకీర్తనం సేవా తచ్చిహ్నై రంకణం తథా ॥**
**తదీయారాధనంచేజ్యా నవధా భిద్యతే శుభే ।**
**నవకర్మ విధానేజ్యా విప్రాణాం సతతం స్మృతా ॥**

(భక్తి సందర్భము -198 సంఖ్యాధృత పద్మపురాణ వచనము)

తా ॥ (1) అర్చనము (2) మంత్ర పఠనము (3) యోగము (4)యాగము (5) వందనము (6) నామసంకీర్తనము (7) సేవ (8) చిహ్నధారణము (9) వైష్ణవపూజ ఈ తొమ్మిది విధములైన భక్త్యంగములను ఇజ్య అని యందురు. బ్రాహ్మణు లెల్లపుడు ఈ తొమ్మిది విధములుగా భగవదర్చన చేయవలెనని తెలిసికొనవలెను. శ్రీల గోస్వామి పాదులు అర్ధ పంచకమును గూర్చి ఇట్లు చెప్పినారు.భగవంతుడు, భగవంతుని పరమపదము, భగవంతుని ద్రవ్యము, భగవన్మంత్రము, జీవాత్మ ఈ అయిదు విషయములను అర్ధపంచకము అని అందురు. ఈ పంచతత్త్వ మెరింగినవారిని అర్ధపంచకవేత్త యని అందురు. ఈ విషయమును గూర్చి హయశీర్ష పంచరాత్రములో ఇట్లు వర్ణింపబడినది :

(1) శ్రీకృష్ణుడే ఏకైక ఈశ్వరుడు. ఆయన సచ్చిదానంద విగ్రహము గలవాడు. పద్మపత్రములవలె విశాలమైన నేత్రములు గలవాడు. నల్లని వెంట్రుకలు గలవాడు అయియున్నాడు. ఆ వైకుంఠ పతియగు భగవంతుడు విశాలమైన నేత్రములు గలదియును, సువర్ణకాంతి గలదియును, చిత్స్వరూపము గలదియునగు లీలాదేవిచే స్వభావముగా దృఢభావముతో ఆలింగతమై యున్నాడు. ఆయన నిత్యుడు, సర్వగతుడు, పూర్ణుడు, వ్యాపకుడు, సర్వకారణ కారణుడు, వేదములలోని నిగూఢ తత్త్వము గలవాడు. పెక్కు విధములైన శక్తులకాధారముగా నున్నవాడు, నిత్యనవాయమానభావము గలవాడై యున్నాడు.

(2) ఆయన యున్న స్థలము ప్రకృతికి అతీతమైనదియు, అవ్యయమైనదియు, శుద్ధ సత్త్వమైనదియు, కోటిచంద్ర సూర్యులయొక్క కాంతిగలదియు నయి యున్నది. ఆ స్థలము చింతామణి మయమును, సాక్షాత్తు సచ్చిదానంద స్వరూపమును, సర్వభూతముల కాధారమును, యేవిధములైన ప్రళయములు లేనిదియు నయి యున్నది.

(3) అక్కడ నున్న వస్తువుల గూర్చి ఈ విధముగ వర్ణింపబడుచున్నది. అచ్చటనున్న వృక్షములన్నియు సర్వభోగప్రద కల్పవృక్షములే. లతా సమూహములు గూడ అట్టివే. వీని నుండి కాసిన ఫలపుష్పములు గూడ అట్టివే, అచ్చట ఉన్న వస్తువులలో హేయాంశము లేమియులేవు. అందువలన అది రసస్వరూపము.

(4) దేవతకును, తదీయ మంత్రమునకును వాచ్యవాచక సంబంధము గలదు. దేవత వాచ్యము, మంత్రము వాని వాచకము. కాని తత్త్వవేత్తలు దేవతా మంత్రములను అభిన్నముగా కీర్తింతురు.

(5) గాలికిని, సముద్రమునకును కలయిక వలన ఉత్పన్నమగు తరంగమునుండి ఏ విధముగా తత్స్వరూపముతోను, ఉపాధితోను సమావృతమైన వేలకొలది కణములు ఉత్పత్తియగుచున్నవో ఆ విధముగానే ఆ శ్లేషమువలన మూర్తా మూర్తరూపమున వేలకొలది ఆత్మయొక్క ప్రకాశమగును.

పాంచరాత్రిక దీక్ష ద్వారా మానవులు బ్రాహ్మణత్వము పొందగలరు అను విషయములో శాస్త్రములిట్లు చెప్పుచున్నవి.

యథాకాంచనతాం యాతికాంస్యం రసవిధానతః।
తథా దీక్షావిధానేన ద్విజత్వం జాయతే నృణామ్ ॥
యస్య యల్లక్షణం ప్రోక్తం పుంసోవర్ణాభివ్యఞ్జకమ్ ।
యదన్యత్రాపి దృశ్యేతతత్తే నైవ వినిర్దిశేత్ ॥
భక్తి రష్టవిధ హ్యేషా యస్మిన్ మ్లేచ్ఛో వివర్తతే,
సవిప్రేన్ద్రో మునిశ్రేష్ఠః సజ్ఞానీ సచపండితః ॥
కారణాని ద్విజత్వ స్యవృత్త మేవతు కారణమ్ .

తా॥ రసాయనిక పరిశోధనము వలన కాంస్యము బంగారమగునట్లు, దీక్ష ద్వారా మానవుడు బ్రాహ్మణత్వమును పొందగలడు. వర్ణములను గుర్తించుటకు శాస్త్రములలో ఏయే కులమునకు ఏయే లక్షణములు చెప్పబడినవో అవి ఇతర కులములలో కనబడినచో వారి లక్షణముల పట్టియే వారి వర్ణము నిర్ణయింపవలెను. అష్టవిధములైన భక్తి మ్లేచ్ఛున యందు ఉన్నచో ఆయననే బ్రాహ్మణ శ్రేష్ఠుడనియు, జ్ఞానియనియు, పండితుడనియు తెలిసికొనవలెను. వృత్తియే బ్రాహ్మణత్వమునకు కారణము.

అందువలన నీజన్మములో పాంచరాత్రిక అధికారము గలవారు బ్రాహ్మణత్వమును పొందగలరు. పాంచరాత్రిక భగవత్తత్త్వము జన్మాంతర సాపేక్షమని అందరి అభిప్రాయము; కాని భాగవతము మొదలగు శాస్త్రములును, శ్రీచైతన్య మహాప్రభువును ఆవిధముగా చెప్పుటలేదు.

# శ్రీహరి సంకీర్తన - దాని తీరు తెన్నులు

శ్రీకృష్ణనామ సంకీర్తనమును రాగతాళయుక్తము శ్రవణానందకరమగు సంగీతము తోడ మాత్రమే చేయవలసిన పనిలేదు. శ్రీచైతన్య మహాప్రభువు మనలను సంగీత విద్వాంసుల వద్ద సాధనచేసి సంగీతమునందు ప్రావీణ్యత పొంది తరువాత మాత్రమే హరికీర్తన మొనరింపుడని చెప్పి యుండలేదు. ఐహికేంద్రియములను తృప్తి నొందించు కీర్తనమును గాక, శ్రీకృష్ణుని అప్రాకృత ఇంద్రియములను తృప్తి నొందించు కీర్తనమును మాత్రమే చేయవలయునని మనకు ఆయన చెప్పి యున్నారు.

శ్రీ చైతన్య మహాప్రభువు శ్రీనామసాధనాక్రమమును గూర్చి చెప్పుచూ శ్రీనామమును కీర్తించువాడు సమస్త మోసపూరిత కపటముల నుండి విముక్తి నొంది యుండవలయునని నొక్కి వక్కాణించియున్నాడు. పరధర్మము లేక భాగవత ధర్మము శ్రీనామ కీర్తనము ద్వారా మాత్రమే నిర్వర్తింపబడుచున్నది.

ఆ ధర్మము కపటత్వము, కృత్రిమము లేనిది (ఆ ధర్మములో మోక్షవాంఛకూడ యుండదు). ఇది శ్రీధరస్వామి వ్యాఖ్యానములో కానవగుచున్నది. మనము ధన, జన, పాండిత్యముల కొరకుగాని, గౌరవ ప్రతిష్ఠల కొరకు గాని ప్రయత్నించరాదు. నూటికి నూరు మంది ప్రజలు మోసపూరితమగు వీనినే కాంక్షించుచున్నారు. భగవన్నామముల నుపయోగించి స్వానందము లేక సామూహికానందము, శాంతి సౌఖ్యముల కొరకు భగవంతుని ప్రార్థింపరాదు. భగవంతుని మనము శాంతి సౌఖ్యములు చేకూర్చు సేవకుని వలె చేయరాదు. కర్మిష్టులు ధర్మార్థ కామ మోక్షముల కొరకును, జ్ఞానులు మోక్షము కొరకును ప్రయత్నింతురు. అవ్విధముగా వారు సర్వశ్రేష్ఠుడగు భగవంతుని, సేవక శ్రేణిని దిగజార్చుచున్నారు. వారు ఎన్నటికిని హరిభజన మొనర్పజాలరు. మరియు నిజమగు శ్రీకృష్ణ సంకీర్తనము వారి నోటినుండి వెలువడదు.

శ్రీ జీవపాదులు యిట్లు చెప్పి యున్నారు. ప్రథమమున మనసును శుభ్రపరచుటకు 'శ్రీనామశ్రవణము' ఆవశ్యకమైయున్నది. ఆ విధముగా మనసు పవిత్రమైనపుడు శ్రవణముతో కూడిన శ్రీరూప దర్శనార్హతను పూర్తిగా పొందినపుడు

గుణములుమేల్కొనబడును.తదుపరి భగవంతుని లీలావినోదములతో గూడిన ప్రత్యేకరూప దర్శనమగుచున్నది. ఇట్లు నామ, రూప, గుణ, పరికరములు పూర్తిగా పేర్కొనబడినపుడు భగవంతుని లీలా వినోదములు బాగుగా స్థిరపడి పోవును. ఈ స్థితిని దృష్టిలో పెట్టుకొని క్రమపద్ధతి ఉల్లేఖింపబడినది. ఈ క్రమము కీర్తనమునకును, స్మరణమునకును అనుసరింపవలయును. సమగ్రముగా పవిత్రమైనచో నామసంకీర్తనముతో కూడిన స్మరణమును సాధనచేయవలయును. శ్రీశుకదేవుడిట్లు చెప్పెను. "ఓ పరీక్షిత్ మహారాజా, సర్వసంగ పరిత్యాగులైన యోగులకైననూ నిరంతర హరినామ సంకీర్తనము చేయుట విధింపబడినది."

పెక్కు కోట్ల సంవత్సరములు వేదాంతము నభ్యసించుచున్నను ఏ ఒక్కడును మోక్షమును పొందలేడు. పదినుండి ఇరువది మూరలు గాలిలో లేచు శక్తిని సంపాదించుటకు నాసికను అదిమి పట్టి యోగము నభ్యసించినను సుగుణము శూన్యము. కర్మిష్ఠి లేక అద్వైతజ్ఞాని వలె గాక భగవద్భక్తి జీవితమంతయు కొనసాగించు పరమభాగవతుని నోటినుండి వెలువడు శ్రీమత్ భాగవత ప్రసంగమును శ్రవణము చేయుటయే ప్రాపంచిక జనులకు శ్రేయోదాయకమై యున్నది. శ్రీమద్ భాగవతము తప్ప యితర ప్రపంచ గ్రంథములన్నియు తగులబడిపోయినను హాని జరుగదు. ఒక్క భాగవత గ్రంథము మిగిలిన చాలును. ప్రపంచమున నున్న విద్యా కేంద్రములన్నియు ఎత్తి వేయబడినను శ్రీమద్భాగవత బోధనా కేంద్రము ఒకటి యున్నను చాలును. కాని అత్యాశ్చర్యము, హాస్యాస్పదమునగు విషయమేమనిన ఈ గ్రంథరాజము వ్యాపార వస్తువుగా మార్చబడినది. ప్రస్తుతము అనేకులు శ్రీచైతన్య మహాప్రభువుల బోధనలకు వ్యతిరేక మార్గమును అనుసరించుచున్నారు. ఇది మిక్కిలి దుఃఖకరమైన విషయము.

# శ్రీరూపశిక్ష

ప్రయాగ యందలి దశాశ్వమేధఘాట్ యను స్థలమున, వరుసగా పది దినములు శ్రీచైతన్య మహాప్రభువు శ్రీరూపగోస్వామికి కృష్ణకథలిట్లు చెప్పిరి :

"బ్రహ్మాండ భ్రమితే కోన భాగ్యవాన్ జీవ ।
గురు -కృష్ణ ప్రసాదే పాయ భక్తి లతా బీజ ॥
మాలీ హఞయా కరే సేయి బీజ ఆరోపణ ।
శ్రవణ - కీర్తన జలే కరయే సేచన ॥
ఉపజియాబాడే లతా, బ్రహ్మాండ భేది యాయ ।
విరజా, బ్రహ్మలోకభేది పరబ్యోమపాయ ॥
తవేయాయ తదుపరి గోలోక బృందావన ।
కృష్ణచరణ కల్పవృక్షే కరే ఆరోహణ ॥"

శ్రీకృష్ణపద ప్రాప్తియే జీవులకు సర్వోత్కృష్టమయిన మంగళాధారము. కృష్ణ పదమనగా, పూర్ణకృష్ణ, పరిపూర్ణమయిన రసచమత్కారమునకు కల్పవృక్షము.

మానవులకును, ప్రాణికోట్లకును తలంపులున్నంతవరకు అండము (గ్రుడ్డు) యొక్క బహిః ప్రదేశము కననగునట్లు మానవ చింతనాధార కూడ బ్రహ్మాండమునకు బహిః ప్రదేశము వరకు పరిమితిగలదై యున్నది. బ్రహ్మ బ్రహ్మాండమును సృజించును. ఆసృష్టికి నలుదిక్కులను ప్రాకారములు గలవు. బ్రహ్మాండమునకు పదునాలుగు సోపానములు గలవు.

ఈ బ్రహ్మాండములోనికి ప్రవేశించినవారు నేత్రములు, కర్ణములు, నాసిక, జిహ్వా, చర్మము, వాక్కు, హస్తములు, పాదములు, పాయువు, ఉపస్థము, మనసు మొదలైన ఇంద్రియములచే సంపాదించిన జ్ఞానముతోనే యుందురు. బ్రహ్మాండములోని పదునాలుగు సోపానము లివి: భువః, స్వః, మహః, జనః, తపః సత్యః,అతల,వితుల,సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాళములు ఇందు క్రింద ఏడులోకములు, నడుమ పృథ్వి, అంతరిక్షము, ఇకపైన ఐదులోకములు గలవు. ఈ పదునాలుగు లోకములలోనే మన రాకపోకలు.

సత్య, జనః, మహః, స్వర్గ - ఈ లోకములలో సూక్ష్మ శరీరియుండును. ఇతరలోకములలో స్థూల సూక్ష్మ, శరీరములు మిశ్రితము అయియుండుట జీవులకు ఉనికి. అయిదు ఊర్ధ్వ లోకములలోను, అంతరిక్షము యొక్క కొద్ది యంశములోను సూక్ష్మ వ్యాపారములుండును. భూలోకములో స్థూల వ్యాపారముండును. ఈ పదునాలుగు లోకములే బ్రహ్మాండము. మనము స్థూలము విడనాడి నిర్మలత్వము పొందుదుము. అపుడు పై లోకములందు సంచరింతుము. స్థూలమందు ఆసక్తి కలిగి దీనిని కోరునపుడు స్థూల, సూక్ష్మములచే నావృతమై యీ క్రింది లోకములన్నిటిలో నివసింతుము.

"నేను" అనుదాని పై ఆవరణమే సూక్ష్మ శరీరము. అంతఃకరణము స్థూల శరీరముతో సంబంధము కలదియై రూపము, రసము మొదలయిన వానిని గ్రహించుటకు వేర్వేరు లోకములలో సంచరించును. దీనినే 'బ్రహ్మాండ భ్రమణ' మని అందురు. ఎవరికా భ్రమణము కలుగును? జీవాత్మ స్థూల, సూక్ష్మములతో నున్నపుడు ఆ జీవాత్మకు అట్టి సంచరించుచున్న పరిస్థితి కల్గును. ఇదే జీవుల త్రిమ్మరితనము; అనగా రంగుల రాట్నములో ఉండి ఎక్కుట దిగుటవలె, ఒకప్పుడు సత్కర్మ ఫలితము బట్టి పై లోకమునకు వెడలుట, మఱల నొకప్పుడు అసత్కర్మ ఫలమును బట్టి క్రింది లోకమునకు వచ్చుట జరుగును. పై లోకమున కెక్కిన క్రింది లోకమునకు రావలయును. క్రింది లోకమునుండి పై లోకమునకు వెళ్ళవలెను. మఱల దిగవలెను. పుణ్యము సంపాదించినచో పాపము చేయు ప్రవృత్తి కలుగును.పాపము చేసినచో పుణ్యము చేయుటకు ప్రవృత్తి కలుగును. ఇవ్విధమున తిరుగుట జరుగును. సన్యాసి, తపస్వి, బ్రహ్మచారులు సత్య, జనః, తపః, మొదలయిన లోకములయందు నివసింతురు. సదాచారము గల గృహస్థులు స్వర్గలోకమునకు వెళ్ళుదురు.

జీవాత్మ సూక్ష్మావరణముచే నావృతమైన తరువాత ఏదో యొకవేళ స్థూలావరణముచే నావృతమై క్రింది లోకమునకు వచ్చును. మఱల తపస్సు మొదలయిన వాని ప్రభావముచే స్థూల దేహమును విడిచి, సూక్ష్మదేహముతో పై లోకమును పొందును. మనము ఈ లోకములో ఉండికూడ భావనచే పై లోకమునకు వెళ్ళగలము. కాని, గీత యట్లు చేయకూడదని నిషేధించెను.

**శ్లో ॥ కర్మేంద్రియాణి సంయమ్య యఆస్తే మనసా స్మరన్ ।**

**ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే ॥**

తా॥ కాళ్ళు, చేతులు మొదలయిన వానిని నియమించి మనస్సుచే విషయములను స్మరించు మూఢవ్యక్తి మిథ్యాచారుడని అనబడును.

దీనివలన స్థూల శరీరములో ఉండి సూక్ష్మభావన చేయుటచే మానవుల కమంగళము గల్గును. మనకు కేవలము భగవదుపాసన మవసరము. భగవంతుడు స్థూల, సూక్ష్మములకు అతీతుడు. ఏదియైనను, భగవంతుని సేవచే కల్గు ఎడతెగని యానందమునకును, అఖండ జ్ఞానమునకును, నిత్యమయిన యునికిని అవరోధము కల్గించలేదు. భగవత్సేవను బట్టి సేవకులు తదనుగుణమైన యవస్థ పొందుదురు.

మనము ఈ పదునాల్గు భువనములలో సంచరించు నర్హత గలవారలము. మనకు ఈ భువనములలో వేర్వేరు యోనులలో సంచరించు అర్హత గలదు. అనగా మానవ, పశు, పక్ష్యాది జన్మములు కలుగును. ఏయే శరీరములతో ఏయే లోకములలో నుండుదుమో, కోరికలు నెఱవేర్చుకొనుటకు అనుగుణమైన బాహ్యావరణము కూడ లభించును. కోరికల నుండి విడుదల పొందుటకు అనేక విధములైన కృత్రిమ మార్గములు కల్పింపబడినవి. ఆ మార్గముల యొక్క విస్తారమైన వివరణము వ్రాయబడినది. బ్రహ్మాండములను చూచుటకు కోరిక తీరిన తరువాత జీవులు భాగ్యవంతులు అగుదురు. కాలచక్రము నందుపడి జీవులందఱు బ్రహ్మాండముల యందు సంచరించుదురు. దేవతలు కానిమ్ము, మానవులు కానిమ్ము ఈ పరిస్థితిలో ఉన్నవారి అవస్థ నిజముగా నశ్వరమైనది.

గురువు యొక్క అనుగ్రహ వశమున ఆత్మ ధర్మము ప్రకాశమయినచో "నేను" అను భావము నందు భక్తి బీజము లభ్యమగును. గురుకృప యందును, కృష్ణ కృపయందును తేడా ఏమియును లేదు. అట్లుకాదు. ప్రసాదము అనగా పరిపూర్ణమైన ఆనందముతో ఇయ్యబడిన భగవంతుని యొక్క అనుగ్రహము. మనము వ్యవహరింప తగిన ఏ అనుగ్రహమును కోరుదుమో అద్దానినే పొందగలము. ఏమి పొందుదుము? భృత్యుడు అయి ప్రభువుని సేవించుట అనునదే భక్తి, తరువాత సేవాకార్యముల యందు ఆసక్తి కలుగును అనునది భక్తి బీజము. అనగా సేవ అను లతకు విత్తనము.

జ్ఞాన, కర్మ వృక్షములకు కూడ పెక్కు విధములు కలవు. అవి కూడ విస్తార ధర్మములు గలవి. సద్గురువు లేదా కృష్ణ కృప లేని వ్యక్తికి బ్రహ్మాండ భ్రమణమునకై లేదా ఆత్మనాశనమునకై అట్టి అపాత్ర ప్రేయః విష వృక్ష విత్తనము లభించును.

కర్మము యొక్క భోగ ప్రవృత్తి యందును, జ్ఞానము యొక్క త్యాగ ప్రవృత్తి యందును తన సుఖ తాత్పర్యము గలదు. కాని సేవావృత్తి యుండదు.

"నేను సేవకుడను, సేవ చేయుటయే నా ధర్మము" అను సిద్ధాంతము నందు ప్రతిష్ఠిత మగుటయే మాలి యగుట. మాలి చెట్లను సేవించును. విత్తనములు నాటుట మొదలుకొని చెట్లు పెద్దవి యగుట వరకు సేవచేయుచు నుండును. తర్వాత కూడ ఫల వితరణము, స్వాదనము చేయునట్లు ఎవరు భక్తిలత సేవాధర్మములో మాలి అగుదురో వారు భక్తి లత విత్తనము పొందుట మొదలుకొని శ్రవణ, కీర్తనములను నీరు పోయుచుందురు. చాల జాగ్రత్తతో అంకురమును రక్షించుదురు . చెట్లు పెద్ద అయినపుడు కూడ నీరు పోయుట ఆపరు. అనగా సేవాధర్మము విడిచిపెట్టరు. ఫలాస్వాదన, ఫల వితరణ రూప సేవాకార్యము చేయుచుందురు. అనగా నిత్య శ్రవణ, కీర్తనలు చేయుచుందురు. మనము ఏవిధమయిన సేవ చేయుదుము? గురువు యొద్దనుండి పొందిన భక్తి లత విత్తనము, ఏది కృష్ణుడు అహేతుక కృపచే తానే సేవక గురురూపముగా యిచ్చినారో నేను కూడ ఆ కృష్ణసేవయే చేయుదును. నేను నిష్కపటముగా శ్రీగురు పాదపద్మములను ఆశ్రయించిన యెడల భక్తిలతా బీజము లభించుట, యా గురువు యొక్క ఆదర్శసేవకుని సేవా పద్ధతి చూచుటకు సౌభాగ్యము నాకు కల్గును.

కృష్ణ సేవా వృత్తి విభిన్నమైన ప్రణాళికల యందు ఉదయించును. అవి:- 1. భక్త ప్రసాదము వలన ఏర్పడినది. 2. కృష్ణ కృప వలన ఏర్పడినది. 3. సాధనాభి నివేశము వలన ఏర్పడినది. కృష్ణుని భక్తులను సేవించుటకై కృష్ణుడు తన మిక్కిలి ప్రియమైన సేవకుని ద్వారా సుకృతి గల వ్యక్తులకు సేవాధికారము యిచ్చును. నేను సేవను స్వీకరింపను అని గురువు చెప్పినచో శిష్యునకు సేవ లభింపదు. నేను ఎవరిని సేవించుచున్నానో, నీవు కూడ వారినే సేవింపుము అని గురువు అందురు. భోగియును, త్యాగియును అయి భగవత్ సేవనుండి దూరము వెళ్ళకుము. నేను నీకు అట్టి సౌకర్యము కలిగింతును.

"ఛాడియా వైష్ణవ సేవా, నిస్తార పేయేఛే కేవా ।"

తా:- వైష్ణవ సేవ విడిచి ఎవరు ముక్తి పొందిరి? మహనీయుల సేవ విడనాడి యెవ్వరును ముక్తిపొందలేరు.

భగవత్సేవోపకరణములు మనయొద్దకు వచ్చి చేరినప్పుడా ఉపకరణములను సేవించుట చేతను, ఆ ఉపకరణముల చేత సేవ చేయుట సంభవించును. ఎవ్వనివలన మనము భగవత్సేవ అలవరచుకొందుమో వారు చేయునటుల చేసినచో అది సేవయగును. వారు చేయు పూజకై పుష్పములు కోసి యిచ్చిన, ఎల్లవిధముల వారికి సహాయము చేసిన నేను కూడ సేవక శ్రేణిలో చేరిన వాడనే. అపుడు నాగురుదేవులు, వారి బంధువులగు సాధువులు నా సేవ్యులని తలంపు గల్గును. శ్రీగురు పాదపద్మముల వద్ద కీర్తనము వినిన, పరిపూర్ణమైన, అడ్డులేని సేవాధర్మము, చక్కగ చూచుటకు సౌకర్యమును, సౌభాగ్యమును పొందిన యెడల మనము గూడ సేవ చేయగలము. గురు పాదపద్మములు, వారి బంధు వర్గమగు సాధువులు బహిర్జగత్తున నున్న వస్తువులు కాదు. నేను మూర్ఖుడను. మూర్ఖత్వము పోగొట్టునట్టి భాషచే చెప్పి నా మూర్ఖత్వమును తొలగించు ప్రయత్నము చేసి, మనకు సాధు వృత్తిని నేర్పరచును. సాధువుల వృత్తి విద్యుద్యంత్ర కార్యము వలె నుండును. అది యసద్వస్తువులను ముట్టడించును. సద్వస్తువులను ఆకర్షించును. సాధు సాంగత్యము వలన సాధువృత్తి లభించును. అసద్వస్తువులను విడచిపెట్టుమనియు సద్వస్తువులను గ్రహింపుమనియు తప్ప సాధువు లితరోప దేశము నివ్వరు. అసాధువు లెల్లప్పుడు పెక్కు భగవదితరోపదేశములు చేయుదురు. యితర కథా వార్తలను చెప్పుదురు. "అసత్ వస్తువులను వదలి పెట్టుటయు, సత్ వస్తువులను స్వీకరించుట'' యను మాటలు సాధు ముఖతః వినునప్పుడు దాని తాత్పర్యాన్వేషణము చేయవలయును. సాధు గురువులు జగమున వరుసగా నుందురు. భక్తి మార్గము, కొంత దూరము పయనించిన తర్వాత యది బోధపడును. కాని దీనికి ముందే అసాధు సంగమైన యెడల దానివలన మన భగవద్భజనకు విఘ్నము కల్గును.

"జడ విద్యా యత, మాయార వైభవ, తోమార భజనే బాధా ।
మోహాజనమియా, అనిత్య సంసారే, జీవకే కరయే గాధా ॥"

గాడిద బరువులు మోయగా మోయగా బాధపడినట్లు ఈ జగమున నున్న విషయాసక్తి గల వ్యక్తులు కూడ గాడిదవలె సంసార భారము మోయుదురు. మరియొకపుడు వృధా త్యాగ తపస్సులు సలుపుదురు. కృష్ణ భజనము లేనట్టి త్యాగ తపస్సులు కూడ గాడిదవలె బరువు మోయుటయే. ఇవన్నియు భజనమునకు విఘ్నములు. భజనమునకు విఘ్నములు కలిగిన మనమాత్మ ఘాతకుల

మగుదుము. శ్రీగురు పాదపద్మముల యొక్క కృపచే భజనమునకు గల్గు విఘ్నములు తొలగిపోవును. భజనమునకు విఘ్నములు వాస్తవికముగా అపనయనమయిన యెడల సౌకర్యము గల్గును.

గురు ముఖము నుండియు, సాధువుల యొద్ద నుండియు శ్రవణము చేయవలెను. వారి నిర్దేశానుసారముగా చేసిన పఠన పాఠనములు గూడ శ్రవణాంతర్గతములే. లేనిచో విపథగాములమై యొకప్పుడు సత్కర్మ అను బరువు మోయు ప్రయత్నము చేయుదుము. ఎక్కువగా నీతివాదుల మగుటకు ప్రయత్నింతుము. విధి నిషేధముల ననుసరించి నడుచుటకు ప్రయత్నింతుము. మరియొకప్పుడు నిర్విశేషవాదులమై యలసత్వం సాధింతుము. శ్రవణ, కీర్తనములు చేయకుండుట వలననే యిట్టి దుర్గతి కల్గుచున్నది. శ్రీగురు పాదపద్మములను ఒక్క ముహూర్తము విడచిపెట్టిన యెడల యిట్టి దుర్గతి కలుగక తప్పదు. శ్రవణ, కీర్తనములు -నీరు. నీరు చల్లించు వారు -గురుపాద పద్మాశ్రిత వ్యక్తి. పరిపూర్ణ విశ్వాసముతో నెల్లప్పుడు గురు పాదపద్మములను సేవించుటయే ముఖ్యమయిన కర్తవ్యము. ఈ విషయము గూర్చి మనమెవ్వరిని యడుగనవసరము లేదు. భక్తి యనెడు లతను యత్నముతో పోషింపవలయును. నేను చక్కగా భగవత్సేవ చేసెదను అను బుద్ధినుండి విచ్యుతి యగుట వలననే మన కమంగళము గలుగుచున్నది. సాధు, గురువుల సాంగత్యము చేయుటయే కర్తవ్యము. వారు దయతో మనకు ఎన్నియో సేవా సౌకర్యములు గల్గించిరి. వారు ఆదర్శమయిన చరిత్ర చూపించుట వలనను, ఆదర్శ చరిత్ర వర్ణించుట వలనను యిక ఎన్నో విధములుగా మనకు మేలు కల్గింతురు. వారు వర్ణించు విషయములు అనుభవించు బుద్ధి మనకు కల్గిన నెంతయో సౌకర్యము కల్గును! నేను పురాణము చెప్పుచున్నాను అను అహంభావము వుండకూడదు.

"యాహా భాగవత పడ వైష్ణవేర స్థానే"

వైష్ణవుల యొద్దనుండి భాగవతము వినవలెను. నేను భాగవత ఉపన్యాసము చెప్పుచున్నానను అభిప్రాయము ఉండకూడదు. మనము మన సొంత గాథలు ఏమియూ ప్రచారము చేయరాదు. మన పూర్వ గురువులు చెప్పిన మాటలే ప్రచారము చేయవలెను. సభలలో ఉపన్యాసము చెప్పునపుడు పూర్వగురువుల కంటె నేనే తేటతెల్లముగ ఉపన్యాసము చెప్పగలననియు, పూర్వ గురువు లట్లు చేయలేక పోయిరని, వారి మాటలు ప్రజలు అర్థము చేసుకొనలేకపోయిరనియు, పల్కుట దుర్బుద్ధి గలవారి లక్షణము. మన కర్తవ్యము శ్రవణ, కీర్తనములు

చేయుటయే. శ్రీ గురు కృపవలన పొందిన భక్తి బీజము నందు ప్రతి నిత్యము నీరు పోయుటయే. నేను అందరికంటె ఎక్కువ తెలివి గలవాడను. ఇతరులు నాకంటె తెలివితక్కువ వారు అనునట్టి భేద భావము లుండరాదు.

నీరు పోయకుండిన విత్తనము ఎండిపోయి నష్టమగును. ఒక్కొక్కపుడు నీరు ఎక్కువైనచో విత్తనము కుళ్ళిపోవును. అధికారము లేనివారు శ్రవణ, కీర్తన రూపమగు నీరుపోయుట అను మిషతో చండిదాస, విద్యాపతి రాస పంచాధ్యాయములు అను రస గ్రంథములను శ్రవణ కీర్తనము చేయుటకు ప్రయత్నము చేసిన భక్తి బీజము మొలకెత్త జాలదు. పంచవర్ష ప్రాయము గల బాలికకు స్త్రీ పురుష ప్రేమను నేర్పించినప్పటికి ఆ బాలికకు అది యర్థము కాదు. కాని యుక్తవయస్సునందు స్త్రీ, పురుష ప్రీతి విషయము తనంతటదే యువతి హృదయమందు స్ఫురించును. అపుడు నిజముగా ఆమె ప్రేమ విషయము గ్రహించగలదు. అందువలన సరియగు భగవత్తత్త్వ జ్ఞానము పొందుట మిక్కిలి యవసరము. భగవదితర కథల నుండి దూరమున నుండుటకు ప్రయత్నింపవలెను. లేనియెడల సాధు గురువులు భగవత్ కథలు చెప్పినను గ్రహింపజాలము. అట్టి పరిస్థితి రాకముందు "జయదేవుల గీత గోవిందము" అను గ్రంధము చదివిన వృధా కాలక్షేపమే కాక మనకు ఫలము దక్కనేరదు. సమయాను కూలముగా పని చేయకపోయిన సౌకర్యము లభింపదు. భక్తి అధికారము లేనివాడు భక్తి రస గ్రంథములను చదువుట క్షయరోగి వనితా విలాసము కోరినట్లగును. పరీక్షిన్మహ రాజుల యభిప్రాయము వలె మనకును యభిప్రాయము లుండవలెను.

"ఉపజియా బాడే లతా బ్రహ్మాండ భేది యాయ"

శ్రీ కృష్ణ పాదపద్మములు సేవింపవలెను. ఇంద్రియ సంతోషము కొరకు మనము ప్రయత్నము చేయనక్కరలేదు. భక్తి లత బీజము నందు శ్రవణ, కీర్తనమను నీరుపోపి ఆత్మ జ్ఞానము సంపాదించుట మిక్కిలి అవసరము. శరీర పోషణ చేయుట పశుపక్షులకు గూడ ధర్మమే. నిత్యమగు మేలు వెదకుటయే మన ముఖ్యమగు ధర్మము. ఆత్మఘాతి యగు పశుప్రకృతి గలవారు అప్రాకృత మగు భగవత్కథా శ్రవణ కీర్తనలు చేయరు. భక్తి లత పెంపొందునపుడు దాని కనువగు పందిరి యవసరమగును. ఈ భక్తి విషయమున పందిరి యనగా నేమి? శ్రీ కృష్ణ పాదపద్మములే పందిరి. అట్టి కృష్ణ పాదపద్మములనాశ్రయించిన ఆ భక్తిలత ఉల్లాసముతో యభివృద్ధి చెందు చుండును. సత్య, జనః, మహః, తపః మొదలగు లోకములందు భక్తి తీగ వెళ్ళిన కాలిపోవును. అట్లయినచో మన పరిశ్రమ

వ్యర్థమగును. మృదంగమును గట్టిగా కొట్టుటయే సారమగును. జగమున బహు విధమగు మనోధర్మము యొక్క ఆలోచన గల వ్యక్తులకు బహు విధములగు నిబ్బందులు గలుగును. భక్తి లత ఈ బ్రహ్మాండమును దాటి వెడలును. అట్టి బ్రహ్మాండమును దాటిన పిమ్మట విరజ అను నొక నది యుండును. దానిలో 'కారణము' అను నీరు గలదు. ఆ నీరు వలన బ్రహ్మాండము సృష్టి అయినది. అక్కడ రజోధర్మము లేదు. అనగా త్రిగుణములు అచ్చట సమముగా నుండును. అట్టి త్రిగుణములు విభజింపబడి చూర్ణమై విరజ యందు క్రియా శూన్య పరిస్థితిలో నుండును. ఈ ప్రపంచమందలి సృష్టి వస్తువు యొక్క కారణము ప్రకృతి. కొంత ఉన్నతి చూపించి స్థిర భావము ఏర్పరచుకొనుట ఈ బ్రహ్మాండ స్వభావము. యిక్కడ అధిష్టానము లభ్యమవదు. అనగా సేవింప దగిన వస్తువు లభ్యమవదు.

విరజా నది ఆవలి ఒడ్డున బ్రహ్మలోకము. విరజానది మీదుగా ఆ భక్తిలత అభివృద్ధి చెందుచున్నది. బ్రహ్మలోకము నిర్విశేష జ్యోతిర్మయ సాధనము. అక్కడ కూడ భక్తి లతకు సేవింపదగిన వస్తువు అనగా తీగకు పందిరి వలె ఆధార యోగ్యమైన వస్తువు లభ్యమవలేదు.

బ్రహ్మలోకము దాటిన తరువాత సవిశేష భగవత్ ధామమగు మహావైకుంఠము, రస భేదమున వైకుంఠము కంటె గూడ గోలోకమునకు శ్రేష్ఠత్వము గలదు.

**శ్లో ॥ సహస్ర పత్ర కమలం। గోకులాఖ్యం మహత్పదమ్ ।**

**తత్కర్ణికారం తద్ధామ। తదనంతాంశ సంభవమ్ ॥**

శ్రీకృష్ణ పరమాత్మ యొక్క ప్రాకృత లీలలకు ప్రముఖస్థానం గోకులం. యిది యొక సహస్ర కమల పత్రముగా వర్ణింపబడినది. దీనిలో వేయి రేకులు గలవు. మధ్య కర్ణికారమె యా భగవానుని నివాస పీఠము. గోకులం కూడ గోలోకము వలె చిన్మయ ధామమే. బలదేవుడే దీనికి ప్రధాన శక్తిగా నున్నాడు. విరజా నదితీరాన బ్రహ్మతేజస్సమావృతమైన యాపదము నారాయణ సమేతముగా జిజ్ఞాసువులకు కన్పించును. అందుచే గోకుల, గోలోకముల కభేద భావమే గోలోకము గోవింద సంచార పునీతమే.

గోలోకములోని శ్రీ కృష్ణ పాదపద్మములే ప్రేమ భక్తికి సర్వోత్కృష్టమయిన యాధారము. ప్రతి నిత్యము కృష్ణ కథా శ్రవణ కీర్తనమను నీరు విధిగా పోసినచో భక్తిలత యక్కడ మిక్కిలి సుఖముగా నుండును.

# విద్యా భాగవతావధి

శ్రీమద్భాగవతము నిగమ కల్పతరువు నుండి నిర్గళితమైన ఫలము.

**శ్లో ॥ నిగమ కల్ప తరోర్గళితం ఫలం శుకముఖాదమృత ద్రవ సంయుతమ్ ।**
**పిబత భాగవతం రస మాలయం ముహురహో రసికా భువి భావుకాః ॥**

నిగమ శబ్దమున కర్థము వేదములు. అట్టి వేదములు - కల్ప తరువులు. అనగా సంకల్పితమును లేదా కాంక్షితమగు ఫలములను యిచ్చునట్టివి. అభక్తులు ధర్మార్థ కామ మోక్షములను కాంక్షింతురు. కాని భుక్తి, ముక్తుల చేత చిక్కని వారు భావనా పథమును నతిక్రమించు వారు నగు భక్తుల సంకల్పము అట్టి కురస నీరస (కుళ్ళిన, ఎండిపోయిన) రసములతో కూడిన వస్తువు గాదు. అన్యాభిలాషులగు కర్మ మార్గీయులు వికారము చెందిన రసమును కోరుదురు. అభేద బ్రహ్మవాదులగు జ్ఞానులు నిర్విశేషమగు నీ రసమును ప్రార్థింతురు. భాగవతము అట్టి కురసము లేదా నీరసముతో కూడిన ఫలము కాదు. విషయాశ్రయ భావము యొక్క, సేవ్య సేవక భావము యొక్క పరిశోధనాత్మకాలోచన క్రమక్రమముగా మిక్కిలి సంకుచితము, ఈ షన్ముకుళితము, పుష్పితము, వర్ధితము, పరిపుష్టము, ప్రపక్వము మున్నగు ఉత్తరోత్తర క్రమోత్కర్ష స్థితి భాగవతములో కాననగును. సంశయము, నాస్తిక్యము, నిర్గుణము, క్లీబము, పురుషము, మిధునము, స్వకీయము, పరకీయము మున్నగు విలాసముల ఉత్తరోత్తర క్రమోత్కర్షము పల్లవించుట వలన భాగవతము కల్ప తరువు వంటి సౌందర్యము నాస్వాదించు కుతూహలము గల వ్యక్తుల సంకల్పములను బట్టి ఫలముల నిచ్చు మఱియొక తరువు పదునాలుగు బ్రహ్మాండముల లోనే కాదు, విరజా బ్రహ్మలోకాతీతమైన వైకుంఠ లోకములో గూడ లేదు. అది పరకీయ విచార తారతమ్యములలో చూపించబడినది. మనము దానిని అప్రాకృత సేవా పిపాసుల - రసిక భావకుల భాగవతాస్వాదనము లోనే కనగలము. స్థాయీభావ భూమిక యందున్న వారే భావకులు. స్థాయీ భావములో నాల్గు విధములైన సామగ్రులు కలిసిన అప్రాకృత రస మేర్పడును. అట్టి రసముచే అభిషిక్తులు అయిన వారే నిగమ కల్పతరువు యొక్క ఫలము నాస్వాదింప గలరు. అనగా ప్రాకృత భావనా పథమును విశేషముగా నతిక్రమించి యొక అప్రాకృత

మహా చమత్కార ప్రాచుర్య విశుద్ధ సత్త్వోజ్జ్వల హృదయమున రస మాస్వాదిత మగును. అట్టి రస రసికులే శ్రీమద్భాగవతాస్వాదనము జేయగలరు. శ్రీ మద్భాగవతము సాక్షాత్తు అఖిల రసామృత స్వరూపుడైన శ్రీకృష్ణుడు. ఆలయం-లయమభిప్రాప్యముక్తావస్థయందు గూడ భాగవతరసమాస్వాదింపబడినది. ముక్తి పొందిన వారే శ్రీమద్భాగవత రసాస్వాదనము చేయుచుందురు. ముక్త కుల శిరోమణులు పరమహంసలును నగు వైష్ణవుల ముఖారవిందముల నుండి శ్రీ మద్భాగవతమును శ్రవణము చేయక అనర్థములతో గూడిన వాడును, అనర్థ సముద్రములో ఈత కొట్టుటకు కుతూహలము గలవాడునునగు ప్రవచ కబ్రువుల వలన సాహిత్య రసము నాస్వాదించి ఇంద్రియ పోషణకై భాగవత శ్రవణము జేసినట్లు నటించు నప్పటికిని భోగి సంప్రదాయములు భాగవతములోని నిర్మల రసము నాస్వాదింపలేరు. వారు విరసము లేదా కురసమునే రసమని తలంచి భ్రాంతులగుదురు. శుకదేవుని వలె ముక్త పరమహంసలు భాగవతమును కీర్తించు వారు, పరీక్షిన్నరేంద్రుని వలె జీవనము నశ్వరమని తెలిసిన వారు భాగవతమును విని భాగవతములోని రసముచే నిత్య రసికులై యుందురు.

ఆత్మ వృత్తి పంచ రసములతో కూడినది. పంచవిధములైన రతిచే పంచవిధములైన రసములను వెల్లడి చేసి కృష్ణుని సేవించుటయే ఆత్మ యొక్క నిత్య వృత్తి. శాంతము, దాస్యము, సఖ్యము, వాత్సల్యము, మధురము- యివి పంచ రసములు. శాంతము ప్రతికూల భావవిహీనమైన నిరపేక్షావస్థానము మాత్రమే. దాస్యరసము - కొంత మమత్వముతో గూడినది. కనుక తారతమ్య విచారమున దాస్యరసము, శాంతరస గుణమును క్రోడీకరించి, శాంతరసము కన్న శ్రేష్ఠమైనది. సఖ్యరస మింకను ఉన్నతమైనది. ఇందులో దాస్యరసములోని సంభ్రమమనెడు ఇబ్బందులుండవు. పైగా విశ్రంభమనెడు ప్రధానాలంకారము దీనిలో విరాజిల్లును. వాత్సల్యరసము సఖ్యరసము కంటె శ్రేష్ఠమైనది. దీనిలో మమత్వాధిక్యము మిక్కిలి ఘనీభవించి యున్నది. ఏలయన పరమవిషయ వస్తువగు భగవంతుని కూడ "పాల్యుడు" లేదా "ఆశ్రితుడు" అని తలంతురు. మధుర రసము సర్వ శ్రేష్ఠమైనది. దీనిలో మిగిలిన నాల్గురసములలోని చమత్కారిత పరిపూర్ణముగా ప్రస్ఫుటిత మగును. యీ పంచ విధములైన రతియందు శ్రీ కృష్ణ

సేవయే ఆత్మ యొక్క అహేతుకమైనట్టిదియును, అప్రతిహతమైనట్టిదియును నగు నిత్య వృత్తి.

జీవుని ఆత్మ స్వరూప విచారమును మన మిట్లు వింటిమి.

"జీవేర స్వరూపహయ్ కృష్ణేర నిత్య దాస"

అనగా జీవుడు స్వరూపమున శ్రీకృష్ణుని నిత్య దాసుడు.

శృతిలో "ఆత్మరతిః", "ఆత్మక్రీడః" మున్నగు శబ్దములు కాననగును. అవి ఆత్మ యొక్క నిత్య వృత్తియగు శ్రీ కృష్ణ సేవా వృత్తిని గూర్చి ప్రయుజ్యమని తెలిసికొనవలెను. "రమ్" ధాతువునకు 'తి' ప్రత్యయము చేరగా రతి శబ్దము ఏర్పడినది. "రమ్" ధాతు తాత్పర్యము "అనురాగము" లేదా "లాగుకొనుట". ఆత్మ శబ్దముచే నేను అనగా జీవాత్మ అని తెలుసుకొనవలెను. "పరమాత్మ" అను శబ్దముచే ప్రాభవ వైభవ శక్తి పూర్ణ కర్త్ర సత్తే అధిష్టానము కృష్ణుడే నని తెలుసుకొనవలెను. విషయ విచారమున కృష్ణ పరమమైన నేను, ఆశ్రయ విచారమున విభు చైతన్య అధీనములో నున్న అణుచిత్ స్వరూపుడయిన స్వల్పమైన నేను అనగా జీవాత్మను. "తత్త్వమసి" మున్నగు ఉపనిషద్వాక్యములు దీనినే ప్రతిపాదించుచున్న వాస్తవ వస్తువు ఒక్కటే. అదే అద్వయ జ్ఞానతత్త్వము. అనగా చిద్విలాస వైచిత్ర్యముతో గూడిన అద్వయ జ్ఞాన తత్త్వము. పరమమైన నేను లేదా విషయ తత్త్వమగు శ్రీకృష్ణుని సంతృప్తి కల్గించుటయే జీవాత్మ యొక్క నిత్య వృత్తి.

భూలోకము నుండి మన చిన్మయ ఇంద్రియ వృత్తి గోలోకమును చేరినప్పుడు మనము స్వరూపమగు మధుర రతియందు శ్రీకృష్ణుని మురళీ ధ్వని వినుట కర్హత పొందినపుడు అట్టి మురళీధ్వనిచే మన శుద్ధ చిత్తము అకర్షితమైనపుడు, మనము కేవలము శుద్ధతత్త్వముతో వ్యాకుల చిత్తము గలవారమై అప్రాకృత రాసస్థలమునకు వెళ్ళగలము. అపుడు ప్రజాపత్య ధర్మములు మనలను ఆకర్షింపలేవు. లోకధర్మము, వేదధర్మము, దేహ ధర్మము, దేహ సుఖము, ఆత్మ సుఖము దుస్త్యజమగు ఆర్య పథము, బంధు-బాంధవుల తాడన, నిందనములు మున్నగునవి ఏవియు మన ఆకర్షణ వస్తువులు కాజాలవు. మనము భూలోకము

లోని భౌతికమైన ప్రతిష్టను తృణమువలె తృణీకరించి, స్వర్గ సుఖములను గగన కుసుమమువలె నిరర్ధకమని తలంచి, ముక్తిని ముత్యపు చిప్పవలె తలంచినచో అకించనులైన గోపికల ఐకాంతిక ధర్మమును అంగీకరింపగలము. అపుడు భగవంతుని నామ మాధుర్యము గురు వాక్యాదులచే కర్ణ వివరములలో ప్రవేశము కాగలదు. చేతన (దివ్య) చక్షువులకు భగవంతుని రూపము కనబడును. అట్టి పరమాశ్చర్య రూపముచే ఆకర్షింపబడిన వారమై మనము ఆయన సేవలో నిమగ్నులమై వుందుము. భగవంతుని కథామృతమందు లోభము కలవారమై, ఇతోధికముగా ఆయన సేవలో ఆకర్షితులమై ఉండగలము. అపుడు సంసారములోని వ్యర్థపు మాటలు, కపట మాటలు, చెడు విషయములు మనలను పిచ్చివారినిగా చేయజాలవు. అపుడు మనము నిత్యవృత్తిని (కృష్ణభక్తి) పొంది స్థాయీ భావమగు రతియందు ఆలంబన, ఉద్దీపన అనెడు విభావముల అనుభవాది సామగ్రుల సమ్మేళనముచే కృష్ణ భక్తి రసమును ప్రకటనము చేసి కృష్ణేంద్రియములకు సంతృప్తి కల్గించుటకు సమర్థుల మగుదుము. అన్ని విధములైన అనర్థములు నివృత్తము కాగా పొందిన పరమపదమే శ్రీకృష్ణుని పాదపద్మము.

నిత్య సత్యము, వాస్తవ సత్యము, పరమ సత్యము ఏకైక కృష్ణదాస్యములోనే ఉండును. రసమయుడు, రసిక శేఖరుడు అగు శ్రీకృష్ణ పాదపద్మ సేవయందు మత్తిల్లియున్న జనుల సేవ చేయగల్గినచో, మనము గూడా అట్టి మిక్కిలి దుర్లభమైన సేవాధికారము పొందగలము. ఆ రోజు ఎప్పుడు లభింపగలదో !

# భగవత్సేవా లాభము - సులభోపాయము

నిరంతరము భగవత్సేవ చేయుచున్న భక్తుల సాంగత్యము వలన భగవద్భక్తి లభ్యమగును. భక్తులు భగవత్సేవయే తమ జీవితాధారముగా స్వీకరింతురు. వారు భగవంతుని నామ, రూప, గుణ, లీలాకథలనే తమ జీవన సర్వస్వమని, ఎల్లప్పుడు వానిని పరిశీలింతురు. సాధారణులు, భక్తులు జేయు భగవదాలోచనలో చాల భేదముండును. సాధారణముగా ననేకులు భగవంతుడు ఐహికాముష్మిక సుఖములకు కారణుడని తలంచి వానికై భగవద్భజన చేయుదురు. మఱల అతి బుద్ధిమంతులు అనగా బయటకు త్యాగులు, లోపల భోగిశ్రేష్ఠులు, సర్వభోక్తయైన భగవంతునితో సమానమనుకొని ఆయనలో ఐక్యమొందుటకు భగవదుపాసన చేసినట్లు అభినయింతురు. యింకను మధ్యమ వ్యక్తులు అణిమాది అష్టసిద్ధుల నుద్దేశించి యుపాసన చేయుదురు. వీరిలో నుపాసనాభినయముండినను, ఉపాస్యుడైన భగవంతుని నిత్యమైన నామ, రూప, గుణాదులు గ్రహింపబడలేదు. వారు సర్వప్రభువైన పరమేశ్వరుడు కర్మాధీనుడని తలంతురు. ఈ తరగతిలోని యుపాసకబ్రువులు భగవానుని సేవకొఱకును, సుఖము కొఱకును సేవింపరు.

కాని భక్తుల భావము వేరైనది. వారు ఇహపరలోకముల, దేహాదుల సుఖ సిద్ధులను కోరరను విషయ మట్లుండనిమ్ము; మహా మృగ్యమగు ముక్తిని కూడ కోరరు. మానవులు తమ స్వభావము చేతను, భావము చేతను హృదయ భవనము నందు దైవము నారాధింతురు. ఆ సేవా వృత్తిని ఏదియును అడ్డగింపలేదు. సముద్రము వైపు మిక్కిలి వేగముగా పోవు నదీ ప్రవాహము వలె సమస్త మెట్ట పల్లములను ముంచివేసి ఎదుట నున్న అడ్డమును దూరము చేసి పరుగిడును. ఆ భక్తి ప్రవాహమునకు అడ్డులేదు; విపత్తు లేదు; విరామము లేదు. భగవంతుని సుఖమునకై నయనాభిరాముని నయనములకు నవనవాయమాన రమణీయ రూపమగు స్వరూపము ధరించి, ఆయన కోటి చంద్ర సుశీతల పదతలములను కడిగి ఆ పదతలములందే నివసించును. భక్తులు భగవత్సేవయందెల్లప్పుడు నిమగ్నులై యుందురు. అన్య విషయమందు, అన్య కార్యమందు ఆసక్తి కల్గియున్న చిత్తము ఆ నిత్యయుక్త యోగుల విక్రితాత్మ స్వరూపమందు విషయ చింత

సేకరించు సౌకర్యము చేకూర్చజాలదు. భగవద్భక్తులు భగవత్సేవ యందును, భగవద్భక్తుల సేవయందును నిత్య ప్రీతి గలవారు. వారి దేహము నందును, దేహ సంబంధితమైన స్త్రీ, పుత్రాదుల యందును, గృహమునందును, గృహ సంబంధమైన ఆత్మీయ స్వజనమందు, పాలింపదగిన పశు పక్ష్యాదులయందును, కుల వృత్తుల యందు వారికి ప్రీతి యుండదు. ప్రాణమునకు ప్రాణమును, ప్రాణ పరిశీలుడైన భగవంతుని ప్రీతితో ఆరాధించి, అందు నిమగ్నులై, సర్వవిధముల భగవంతుని యందు శరణాగతి పొందియున్నారు. ఇట్టి భక్తులును, మహాభాగవతులును భగవంతుడే ఆధారమని స్వీకరించిరి. భగవంతుడు కూడ భక్తుల భావమందే కట్టబడి సారమునకు సారమై కూడ వారలను ఆధారముగా చేసుకొనెను. భక్తులు భాగవతములోని ధర్మ కథలను చెప్పుదురు. ఆ ధర్మము లౌకిక ధర్మము కాదు. పారలౌకిక ధర్మము కాదు, ఒక వర్ణమునకు గాని, ఒక ఆశ్రమమునకు గాని సంబంధించినది కాదు. ఆ ధర్మము ఈ జగత్తులోని ఒక దేశ నివాసులకు సంబంధించినది కాదు. ఆ ధర్మము బాలురకు, యువకులకు, వృద్ధులకు, స్త్రీలకు, పశుపక్ష్యాదులకు ఏ మాత్రము కాదు. అయితే ఆ ధర్మము సార్వదేశికమై, సార్వకాలికమై, సార్వజనీనమై విరాజిల్లుచున్నది. ఆ ధర్మము దేహమునకు కాదు, మనస్సునకు కాదు; అది ఆత్మకు సంబంధమైయున్నది. ఆ ధర్మమునకు నిత్య ధర్మమనియు, సనాతన ధర్మమనియు నామాంతరములు గలవు. ఆ ధర్మము కైతవము లేనిది. కైతవమనగా మోసము. ఆ ధర్మము ధర్మమనుసరించువారికి దేహసుఖము, మనస్సుఖము అనగా భుక్తి ముక్తుల కొరకు యెఱచూపదు. ఆ ధర్మము మొట్టమొదట ధార్మికునికి ధన, జన, అర్థాదుల నిచ్చి వారిని క్షణ భంగుర మగు సుఖమునకై ప్రయత్నునిగా చేయించి, తరువాత సుఖవస్తువులు ధార్మికుని చేతినుండి లాగికొనునట్టి కపట ధర్మము కాదు. ఆధర్మము సిద్ధి కాముకునకు సిద్ధి పొందు సౌకర్యమును గలిగించి బుద్ధిసిద్ధుల ననుభవించుటకు ప్రయత్నునిగా జేయును. చివరకు ఐశ్వర్యమంతయు నాశనమైన వెంటనే పూర్వము కంటె ఎక్కువ దుఃఖము కలిగించును. చివరకు సిద్ధి నశించు నట్టి ధర్మము వంటిది గాదు. భాగవత ధర్మము సాధకునకు చైతన్యము లేని వృక్షప్రస్తరాదిస్థావర దేహములు పొందుటకై పేరాశ కలిగించునట్టి పయోముఖ విషకుంభము వంటిది గాదు. ఇది భుక్తి ముక్తుల పొందు కోరికలేని పరమహంసలు సాధింపదగినట్టి

పురుషప్రణీత పరధర్మము. ఈ ధర్మము కేవలము ఆధ్యాత్మికాదితాపత్రయమును దాటించుటయే కాక త్రితాప మూలోన్మూలనము చేయునది. శివదము అనగా నిత్యమంగళ ప్రదము. ఈ ధర్మముననుసరించు ధార్మికులు భుక్తి, ముక్తి సిద్ధులను పొందు కోరికను విడచి లోభమోహముల కతీతుడైన పరమ పురుషుని సేవను పొందుదురు. మరల భగవానుడు గూడ కేవలము సర్వ స్వరూపములకు స్వరూపుడైన ఈశ్వర స్వరూపమున సేవను పొంది సంతుష్టి నొందక విముగ్ధుడై సేవ్య పదవులతో పరమోచ్చ పదవినుండి దిగి, పాదములకు శరణాగతి పొందిన పతి, పరిజన పరిత్యక్తురాలైన గోపలలనాగణములకు లలితరమణుడై, గోప్యుడై, లాలితుడై, సేవకుడై సేవకుల సేవకుడగును. ఆధర్మమే అహేతుక మయినట్టియు, నిర్మలమైట్టియు సేవచేతను, భక్తిచేతను కట్టబడువాడును, భక్తుల భక్తుడునగు భగవానుని భజన రహస్యమును జూపును.

సులభముగను సంక్షేపముగను చెప్పినచో -

"యాహ భాగవతపడ వైష్ణవేరస్థానే"

వైష్ణవుని కడకు వెడలి భాగవత శాస్త్రమును పరిశీలింపుమని శ్రీ చైతన్య మహాప్రభువుల ఉపదేశము.

అందువలన సర్వనిధి స్వరూపుడగు భగవంతుని సేవలో సర్వస్వము సమర్పించు భాగవత స్వరూపులగు భక్తుల సాంగత్యమున భావస్ఫూర్తియగు భాగవత పరిశీలనము చేయుచుండగ ఉభయ భాగవతులు అనగా భక్త భాగవతులను, శాస్త్ర భాగవతమును సేవించుట ద్వారానే సులభముగ భగవత్సేవ లభ్యమగును.



శ్రీల భక్తి విలాస తీర్థగోస్వామి మహారాజ్

# శ్రీల భక్తి విలాస తీర్థ గోస్వామి మహారాజులు

పితాపుత్రునకు, భార్యాభర్తలకు, ఉపాధ్యాయ విద్యార్థునకు ఉన్న సంబంధము ఎంత ఆదర్శమైనదో దానికంటెను గురుశిష్య సంబంధము సర్వోత్కృష్టమని శాస్త్రములు ఘోషించుచున్నవి. ఆదర్శ గురుశిష్య మహిమ శాస్త్రములలో, పురాణములలో, ఉపనిషత్తులలో, భాగవతములో విపులముగ చెప్పబడినది. ఉపనిషత్తులలో ఉద్దాలకుడు, ఆరుణి గురుశిష్య వైశిష్ట్యమును, రామాయణములో సాక్షాత్తు శ్రీరామచంద్రుడు వశిష్ఠునకు, విశ్వామిత్రునకు చేసిన సేవా సంబంధము, శ్రీమద్భాగవతములో స్వయముగ శ్రీకృష్ణుడు. కుచేలుడు గురువైన సాందీపమునికి, శ్రీచైతన్య మహాప్రభువు తన గురువర్యులైన గంగాదాస పండితునకు మరియు శ్రీవాస పండితునకు చేసిన సేవ ఆదర్శ ప్రాయమైనది. దీనిని ప్రాధాన్యముగ స్వీకరించి ప్రహ్లాదుడు, పంచపాండవులు, శ్రీల నరోత్తమ ఠాకూర్‌లు, తుకారామ్, భక్త మీరాబాయి మున్నగు అసంఖ్యాక భక్తులు సేవక జీవితము నందుత్తీర్ణులై భగవంతుని దివ్య సన్నిధానమును చేరిరి.

గురుసేవకు ఆదర్శమూర్తియైన శ్రీకుంజవిహారి విద్యాభూషణ ప్రభువు 1896 సం॥ చైత్ర శుద్ధ సప్తమినాడు వంగదేశమునందలి పులులియా యను గ్రామము (బంగ్లాదేశ్ అంతర్గతము) న అవతరించిరి. బాల్యకాలమునందే సమస్త విద్యల నభ్యసించి, ఉత్తమ విద్యార్థిగ కీర్తికెక్కిరి. అంతులేని విద్యను ఇంకనూ తెలిసికొనుటకు కలకత్తా మహాపట్టణమునకు వచ్చిరి. అచటనుండి యాదవపూర్ అను స్థలమునకు వెడలుచున్న మార్గమున హఠాత్తుగ ఒక మహానుభావుడు కనిపించి 'నాయినా, నీకు సమీపములో ఒక మహావిపత్తు సంభవించనున్నది. పెద్దలయొక్కయు, భగవంతుని యొక్కయు అనుగ్రహము చేత ఆవిపత్తునుండి రక్షణను పొందెదవు. తదుపరి ఒక మహానుభావుని అనుగ్రహమును పొంది, వారిని సేవించుటవలన ప్రపంచమున ఆదర్శమైన సాధువుగ నీవు ప్రకాశించెదవు' యని పలికి అంతర్థాన మాయెను. ఆశ్చర్యకరమగు ఈ సంఘటనను చూచి శ్రీకుంజవిహారి మూర్ఛాగ్రస్తులైరి. కొద్ది క్షణములలోనే బాహ్య స్పృహను పొందిరి.

వీరు ఇంతవరకు కేవలము ప్రాపంచిక విద్యను పొందుటకై యత్నము చేసిరేగాని మహాత్ముల సాంగత్యము, వారి అనుగ్రహము చేత పారమార్థిక

విద్యనభ్యసించుటకు యత్నము చేయలేదు. కాని ఈ సంఘటన జరిగిన పిదపవాత తాను ఉత్తముడైన మహాత్ముని పాదపద్మములను ఆశ్రయించి, పారమార్థిక విద్యను అభ్యసింపవలెననెడి దృఢ సంకల్పముతో మహాత్ముని కొరకై అన్వేషణ ప్రారంభించిరి. దీనికై భగవంతుని ఏకాంతముగ ప్రార్థించిరి. ఏప్రదేశమునందైనా సాధువాగమన వార్తను వినిన వెంటనే వారికడకు వెడలెడివారు. ఎందరను కలసికొనిననూ వారియందు ఆదర్శసాధు చరిత్రగాని, వారు తెలుపు ధర్మవిషయములలో సారముగాని ఉండెడిది గాదు. ఈ విధముగ కొన్ని సంవత్సరములు గడచినవి. విఖ్యాతినొందిన నవద్వీప పట్టణమునందలి వైష్ణవ సంప్రదాయమునకు చెందిన హీరాలాల్ గోస్వామి యనెడి బ్రాహ్మణుని వద్దకు వీరు తమ బాల్యమిత్రుడగు శ్రీసఖీచరణ్ రాయ్‌తో కలసి వెళ్ళిరి. గోస్వామి పాదులు వైష్ణవ సిద్ధాంతమును గురించి చెప్పిరి గాని, ప్రసాదముగ మాంసాహారము నిచ్చిరి. ఇది చూచి వీరుభయులు అచటినుండి వచ్చివేసిరి. ఇంకొకరోజున శ్రీసఖీచరణ్‌రాయ్ మరియు శ్రీకుంజవిహారి, శ్రీల గౌర కిశోర్ దాస్ బాబాజీ మహారాజు గారి దర్శనమునకు వెళ్ళిరి. ఆ సమయమున బాహ్యదృష్టి హీనులగు శ్రీల బాబాజీ మహారాజు తాను చెప్పెడి ప్రసంగమును మానివేసి శ్రీచైతన్య మహాప్రభువు శ్రీల రూపగోస్వామికి ఇచ్చిన ఉపదేశములనుండి -

"కృష్ణభక్త నిష్కామ అతఏవ శాంత ।
భుక్తి, ముక్తి, సిద్ధికామి సకలి అశాంత ॥"

"కృష్ణభక్తుడే నిష్కాముడు మరియు శాంతితో నుండెడివాడు. కర్మి, జ్ఞాని, యోగులకు క్రమముగ భుక్తి, ముక్తి, సిద్ధి వాంఛలుండుట వలన అశాంతమైన జీవితముతో నుండెద"రని విపులముగ చెప్పిరి. ఈ అమూల్యములగు విషయములను వినిన తరువాత శ్రీల బాబాజీ మహారాజుల అనుగ్రహమునకై వీరుభయులు ప్రార్థించిరి. అపుడు శ్రీల బాబాజీ మహారాజ్‌లవారు మాయపురమునందున్న శ్రీ విమలాప్రసాద్ యొక్క పాదపద్మముల నాశ్రయించినచో తనయనుగ్రహము లభించునని చెప్పిరి. ఒకరోజు వీరుభయులు శ్రీ విమలాప్రసాద్ కడకువెళ్ళి దర్శించిరే కాని వానినుండి ఎటువంటి ఉపదేశమును పొందలేకపోయిరి. మరియొక దినమున శ్రీల బాబాజీ మహారాజులను దర్శించుటకు వెడలగ ఆరోజుననే శ్రీల బాబాజీ మహారాజులవారు పరమపదించిరి. బాబాజీ మహారాజుల ఏకైక శిష్యుడైన

శ్రీవిమలా ప్రసాద్‌కు ఈ విషయమును తెలుపుటకు శ్రీ కుంజవిహారి గంగానదిని దాటి శ్రీమాయాపూర్ వైపు వచ్చుచుండిరి. వీరు మాయాపూర్ చేరుటకు ముందే భగవదిచ్ఛ వలన తమ గురువర్యులైన బాబాజీ మహారాజులు పరమపదించిరను వార్తను తెలుసుకొని శ్రీ విమలాప్రసాద్ మూర్ఛితులైరి. ఆసమయమున శ్రీచైతన్య మహాప్రభువు తన పార్షదులతో వారికి దర్శనమిచ్చి 'నీవు నిరుత్సాహ పడవలదు. నీవలన భవిష్యత్తులో ఎన్నో కార్యములు జరుగవలసి యున్నవి. లెమ్మ'ని ఆదేశించిరి. మహాప్రభువు యొక్క అనుగ్రహమును పొందిన శ్రీ విమలాప్రసాద్ గురుదేవుల అంత్యక్రియలను జరుపుటకు వారి శిష్యులైన పరమానంద ప్రభు మరియు పద్మనాభ బ్రహ్మచారితో బయలు దేరిరి. మార్గమధ్యమున శ్రీ కుంజవిహారి శ్రీవిమలాప్రసాద్‌ను వారి తేజస్సును చూసి వారి పాదపద్మములకు నమస్కరించి శ్రీల బాబాజీ మహారాజ్‌ల పరమపదించిన వార్తనుచెప్పబోయిరి. శ్రీవిమలాప్రసాద్ ముందే ఆవిషయమును శ్రీకుంజవిహారికి తెలియచేసి, వారిస్థానమున మీరున్న నాకు భయమెందులకని ప్రబోధించి వారితో నవద్వీపమునకు వెళ్ళి గురుదేవుల అంత్యక్రియలను గావించిరి.

కొలది దినముల తరువాత శ్రీ కుంజవిహారి విద్యాభూషణులు శ్రీమాయాపురము నందున్న శ్రీ విమలాప్రసాదు వద్దకు పారమార్థిక విద్య నభ్యసించుటకు వచ్చిరి. అపుడు వీరికి శ్రీ చైతన్య మహాప్రభువు శ్రీల రూపగోస్వామి పాదులకు ఉపదేశించిన విషయములను -

**బ్రహ్మాండ భ్రమితే కోన భాగ్యవాన్ జీవ్ ।**
**గురుకృష్ణ ప్రసాదే పాయ భక్తిలతా బీజ్ ॥**

ఈ బ్రహ్మాండము నందు పరిభ్రమించుచున్న ఒకానొక భాగ్యవంతుడైన జీవునకు గురు అనుగ్రహము, కృష్ణానుగ్రహము వలన భక్తిలత యొక్క బీజము లభ్యమగునని యు, శ్రవణ కీర్తనములవలన ఈభక్తిలత అంకురించి, పెరిగి, భగవత్ప్రేమను ఫలముగా నొసంగుననియు, భాగవత నిగూఢ రహస్య విషయములను, వేద వేదాంతముల సారమైన మహాప్రభువు ప్రవచించిన అంచిత్యభేదాభేద సిద్ధాంతమును బోధించిరి.

వేదాంత నిగూఢ రహస్య ఖనిని పొందిన శ్రీ కుంజవిహారి విద్యాభూషణ ప్రభువు ఆనాడు యాదవపూర్‌లో మహానుభావుడు కనపడి చెప్పినమాటలు

సఫలీకృతమైనవని ఆనందపరవశము చెందెను. జన్మముతోనే యజ్ఞోపవీతము, కంఠములో తులసిమాల, ఊర్ధ్వపుండ్రతిలకములతో శ్రీల భక్తివినోద మహోదయులు శ్రీమతి భగవతీదేవి అను పుణ్యదంపతులకు అవతరించిన శ్రీభక్తి సిద్ధాంత సరస్వతీ ఠాకూర్ అను పేరుగల విమలాప్రసాద్ నామసంకీర్తనా వ్రత దీక్షతో శ్రీమహాప్రభువుల జన్మస్థానమగు శ్రీధామ మాయాపురమునందు శతకోటి కృష్ణనామ సంకీర్తన వ్రతము నాచరించిరి. అటువంటి మహాత్ముల పాదసన్నిధిన శ్రీకుంజవిహారి విద్యాభూషణులు 1915వ సంవత్సరములో ఆత్మ సమర్పణ చేసిరి.

గురుసేవ ఆదర్శమూర్తియైన శ్రీకుంజవిహారి విద్యాభూషణ ప్రభువు శ్రీల భక్తి సిద్ధాంత సరస్వతీ గోస్వామి మహోదయుల హృదయమును ఆకర్షించెను. వీరియొక్క సేవకు వీరేసాటి. శ్రీకృష్ణసేవకు గోపికలు ఏవిధముగ ఆదర్శమో, గురుసేవ చేసిన వారిలో శ్రీకుంజవిహారి విద్యాభూషణుల సేవ అట్టి ఆదర్శము నొందినది. శ్రీమద్భగవద్గీతయందు శ్రీకృష్ణుడు "ఎవరెవరు ఏయే విధముగ నన్ను సేవించెదరో ఆయావిధముగ వారి సంకల్పములను నెరవేర్చెదను'' అని తెలిపి యున్నాడు. కాని శ్రీమద్భాగవతమందు "అందరికిని నేను ప్రత్యుపకారము చేసి వారి ఋణములను తీర్చుకొంటిని కాని గోపికల ఋణమును మాత్రము తీర్చుకొనలే"నని తెలిపి యున్నాడు. ఆవిధముగనే శ్రీల ప్రభుపాదులు తమ శిష్యులతో "నేను మీఅందరి ఋణములను తీర్చుకొంటిని గాని శ్రీకుంజవిహారి చేసిన సేవకు ఋణమును తీర్చుకొనలేన"ని తెలిపిరి.

ఒక రోజు శ్రీల భక్తిసిద్ధాంత సరస్వతి గోస్వామి పాదులు అనారోగ్యము గానున్నప్పుడు వారి శిష్యులందరు వారి ఆరోగ్యక్షేమము కొరకు పలువిధములైన సేవలు చేసిరి. కాని వారి బాధ క్రమముగ వృద్ధినొంద సాగెనేగాని వారల సేవ వలన ఉపశమనము కలుగలేదు. అపుడొక ప్రఖ్యాత స్వామిజీ 'కుంజబాబును పిలువ మనెదరా?' అని అడిగిరి. ఆ సమయములో కుంజవిహారి విద్యాభూషణ ప్రభువు ఇతర కార్యక్రమములతో దూరప్రాంతములలో ఉండిరి. ఈ విషయమును తెలిసిన శ్రీ కుంజవిహారి తన కార్యక్రమములనన్నింటిని మధ్యలోనే విరమించుకొని గురుసమీపమున కేతెంచిరి. గురుదేవులు ప్రియశిష్యుడైన శ్రీ కుంజవిహారిని చూసినంత మాత్రముననే ఉపశమనము నొందిరి. అంతవరకు నిర్మూలనముగాని బాధ, తనప్రియశిష్యుడైన శ్రీ కుంజవిహారిని చూచినంత మాత్రముననే

బాధలన్నియు నిర్మూలనమయ్యెను. కృష్ణవిరహముతో బాధ పడుతున్న శ్రీ భక్తి సిద్ధాంత సరస్వతీ గోస్వామి మహోదయుల అంతర్భావమును గ్రహించిన శ్రీ కుంజవిహారి విద్యాభూషణ ప్రభువుల రాకచేత అంతర్బాహ్య బాధలన్నియు తొలగిపోయెను. వీరుభయులు శ్రీరాధాకృష్ణుల అంతరంగ పార్షదులు.

శ్రీల భక్తి సిద్ధాంత సరస్వతీ గోస్వామి పాదులు తన ప్రియశిష్యులైన కుంజవిహారి విద్యాభూషణ ప్రభువును గురించి తమశిష్యులకు చెప్పిన అమూల్య విషయములు -

1 కుంజబాబుని సామాన్య వ్యక్తిగను, గృహస్థునిగను భావింపవలదు. గురుసేవకు ఆదర్శమూర్తి యగు వీరికి ఉన్న వైరాగ్యము నాకు ఉన్నచో నేను పారమార్థిక సాధనలో ఉన్నత స్థాయికి చెందిన వాడనగుదును.

2 గౌడీయ వైష్ణవులకు శ్రీరాధాకృష్ణుల కుంజసేవయే ప్రాధాన్యము. ఆరాధాకృష్ణుల కుంజసేవను కుంజవిహారియే గౌడీయ వైష్ణవులకు అందించెను గావున "కుంజవిహారి విద్యాభూషణ్" అని పేరు వచ్చెను.

3 వీరు గౌడీయ మఠ మూలస్తంభము. వైజయంతిమాల, మధ్యమణి, మహా ప్రభువుల సేవను ప్రపంచములోని ప్రజలందరిచేత చేయించగల సమర్థులు.

4 కుంజవిహారి విద్యాభూషణులకు అసంఖ్యమైన మంగళములు కలుగుగాక. వీరికి తోడ్పడి, వీరియొక్క ఆదర్శమును అనుశీలించువారికి గూడ జయము కలుగుగాక.

శ్రీమన్ మహాప్రభువు ప్రచారము చేసిన ప్రేమధర్మమును, అచింత్య భేదాభేద సిద్ధాంతమును ప్రచారము చేయుటకు శ్రీలభక్తి సిద్ధాంత సరస్వతీ పాదులవారు 1918వ సంవత్సర ఫాల్గుణ పూర్ణిమ నాడు చతుర్థాశ్రమమును స్వీకరించి శ్రీచైతన్యమఠమును స్థాపించిరి. దీనిని కేంద్రముగ చేసి, దీని శాఖలుగ భారతదేశమందలి వివిధ ప్రాంతములలో 64 గౌడీయ మఠములను స్థాపించిరి.

శ్రీల ప్రభుపాదుల మనోభావములను శ్రీల కుంజవిహారి విద్యాభూషణులు గ్రహించెడివారు గావున వీరి నిర్ణయమునకే అందరూ ప్రాధ్యానము నిచ్చెడివారు వీరినందరూ గురుప్రేష్ఠులని సంబోధించెడి వారు. ప్రహ్లాదుడు భగవదారాధనకు

ప్రాధాన్యతనిచ్చిన కారణముగ జీవితమునందు ఎన్నియో విపత్తులు కలిగిననూ అవి ప్రహ్లాదుని ఏమియు చేయజాలక పోయినవి. అటులనే గురుసేవా ఆదర్శమూర్తియైన వీరు దీక్షతో గురుసేవ చేయుచున్నపుడు ఎన్నియో విపత్తులు వచ్చిననూ గురుసేవా ప్రభావము వలన అవి ఏమియూ చేయ జాలక పోయినవి. సరళత్వము, వైరాగ్యము, మృదుభాషణ వీరియొక్క స్వతఃసిద్ధమైన భూషణములు.

శ్రీమద్భగవద్గీత, ఉపనిషత్తులలో శలవిచ్చిన భగవదారాధనకు కావలసిన ప్రధాన నియమములు అనగా "అద్వేష్టా సర్వభూతానాం మైత్రఃకరుణ ఏవచ" మున్నగు శ్లోకములలో ఉన్న విషయములు వీరిజీవితములో ప్రత్యక్షముగ ప్రతిఫలించినవి. గీతలో "స్థితప్రజ్ఞస్య కాభాష?" అను అర్జునుని ప్రశ్నకు శ్రీకృష్ణుడుశలవిచ్చిన "ప్రజహాతి యదాకామాన్" నుండి "విషయా వినివర్తంతే" అను శ్లోకము వరకు చెప్పిన విషయములనన్నింటిని వీరిజీవితములో స్పష్టముగ దర్శింపగలము.

వీరు గృహస్థాశ్రమములో ఉన్నప్పటికి వీరియొక్క సాధుభావము, సద్భావము లకు సంతసించి త్యాగులు, యతులు వీరిని గౌరవించెడివారు. శ్రీమద్ భక్తి సిద్ధాంత సరస్వతీ గోస్వామి మహోదయులు పరమపదించిన తదుపరి సుమారు పదిసంవత్సరములు అజ్ఞాతముగ ఉండిరి. గుర్వనుగ్రహముచేత మరల మూలమఠ సేవా బాధ్యతను స్వీకరించి 1948వ సం॥లో చతుర్థాశ్రమమును స్వీకరించిరి. అప్పటినుండి వీరు 'శ్రీమద్భక్తి విలాసతీర్థ గోస్వామి మహారాజ్' అను పేరుతో ఆసేతుహిమాచల పర్యంతము శ్రీచైతన్య మహాప్రభువుల అమూల్య సిద్ధాంతమును పండితులకు, రాజకీయ వేత్తలకు, ఇతర సంప్రదాయ మఠాచార్యులకు అందించిరి. వీరి ఉపదేశములను పొందిన పెక్కుమంది వారి జీవితమును ధన్యాతి ధన్యము గావించుకొనిరి. వీరు అంతిమశ్వాస పర్యంతము గురు ఉపదేశమును, గురు ఆదేశమును పాటించి 1976వ సం॥ బాద్ర బహుళ విదియనాడు అనగా 10.9.76 తేదీన ఈప్రపంచమును విడచి భగవద్ధామమునకు వెడలిరి.

శ్రీ రాయ రామానందుల విగ్రహ ప్రతిష్ఠ సందర్భమున
కొవ్వూరు, శ్రీరామానంద గౌడీయమఠములో
ది. 15.7.79 తేదీన ఇచ్చిన

# శ్రీల ఆచార్యదేవుల అంతిమవాణి

పవిత్ర మానవ హృదయములో భగవంతుని ప్రతిష్ఠించుట, పుష్పములతోను, మంచిగంధముతోడను మాత్రమేగాక మాయాపాశములో చిక్కుకొనకుండ, భక్తితో కృష్ణనామమును జపించునట్లు చేయుట-ఇవియే నాజీవిత పరమాశయములు. పాపముతోను, అపవిత్రతతోను నిండిన హృదయముతో చేయు దైవప్రార్థనలో నాకు నమ్మకములేదు. కులము, పదవి మొదలగు వ్యత్యాసములు లేకుండగ ప్రతివ్యక్తి దైవసేవ చేయుటకు అర్హత గల్గియున్నాడు. కాని ఆసేవ పవిత్రమై యుండవలెను. లేనిచో భగవంతుడు సంతోషింపడు. దైవప్రార్థనకు ముందుగా ప్రజలయొక్క మనస్సును పవిత్రముగా నుండునట్లు జేయుట మతాచార్యుల బాధ్యతయై యున్నది. మానవకోటిలో తాత్త్వికశక్తి సంపదను ఉద్ధరించుటలో మనము నిజమైన ఆచార్యులవలె ప్రవర్తింపవలెను. పవిత్ర జీవిత మననేమియో వారు గుర్తించునట్లు చేయవలెను. మననిత్య జీవితములో మనస్సు, భావనలద్వారా ముందు మనము పవిత్రులము కానంతవరకు శాంతినిగాని, సాంఘిక క్రమ శిక్షణనుగాని సాధింపలేము, స్థాపింపలేము. వాస్తవముగ ప్రజలలో ఆధ్యాత్మిక సంపత్తిని ప్రజ్వాలింపజేయ లేకపోయినచో, ఎట్టి శాశనాధికారము సమానత్వమును సాధింపలేము.

శారీరిక దార్ఢ్యము, బుద్ధి వైశద్యమువలన మనము ఇతరులను జయించలేము. ఈరెండింటికంటె తాత్త్విక విజ్ఞానము, ఇతరులయెడ సానుభూతి చాల అవసరము. రాజకీయ పద్ధతులద్వారా సంఘములో ప్రవేశించిన అవిశ్వాసము, ద్వేషమును తొలగించవలెననిన, ప్రజల దృక్పథములో మార్పుతేవలెను. వ్యక్తికీ వ్యక్తికీ మధ్య, జాతికి జాతికి మధ్య సమానత్వము తేవలెనన్న, అది బలాత్కారముగ గాని, బెదరింపుల వలనగాని జరుగదు. అందరిని సమానపంథాలో నడపగల భక్తిమార్గము ద్వారానే అది సాధ్యమగును. సేవానిరతియే మానవ సమాజములోని కుళ్ళును కడుగగలదు. సంఘముయొక్క పునాదులను కదల్చెడు సాంఘిక దుష్టశక్తులనదియే

అరికట్ట గలదు. భారతదేశము యొక్క ఔన్నత్యము దాని తాత్త్విక సంప్రదాయము మీదనే ఆధారపడియున్నది. వేదాంతులు, తాత్త్వికులు, మహర్షులు దానిని పూర్వము నుండి కాపాడుచు వచ్చిరి. వైదిక వాఙ్మయములో వారికిగల అపూర్వ అనుభవమును, విజ్ఞానమును మనకు ఆస్తిగా అప్పగించివెళ్ళిరి. అట్టివిజ్ఞాన సర్వస్వమును మానవకోటియొక్క వికాసముకొరకు ఉపయోగించవలసిన బాధ్యత, ప్రజాసేవకు, పరబ్రహ్మ సేవకు తమ జీవితము నంకితము జేసినట్టి మహనీయులకు గలదు.

మానవతత్త్వ నిరూపణము చాల గొప్పవిషయమని ఒప్పుకొనక తప్పదు. కాని మనము భగవంతునియందు ప్రేమ లేకుండ, నిజముగా మానవుని ప్రేమింపలేము. ఆస్తిక సంప్రదాయములకు అలవాటు పడకపోయినచో మానవాభ్యుదయ ప్రయత్నములన్నియు కుంటుపడిపోవును. కృతకృత్యములు కాకపోవును. జీవకోటి యందలిప్రేమ, భగవంతునిపైప్రేమ కలసి ప్రవహించినపుడే ఇట్టిసత్ఫలితమేర్పడును. శాంతికి దూరమైన ఏకృతిమోద్యములైననూ విఫలముగాక తప్పదు. ముందు మనలో శాంతి ఏర్పడినతరువాతనే ఇతరప్రపంచ జనులలో శాంతిస్థాపనకు వీలుకలుగునని దార్శనిక సంస్కృతి మనకు బోధించుచున్నది. అందుచేత మనలక్ష్యము ఆత్మాన్వేషణ చింతనలో మునుగనంతవరకు శారీరిక, మానసిక పరిధిలో శాంతి లభ్యముగాదు.

నీ ఆత్మ పరీక్ష చేసికొనుము; శాంతిని సాధింపుము. అప్పుడదియే తప్పకుండ బాహ్యప్రపంచములో ప్రతిచోట దృగ్గోచరమగును. పరబ్రహ్మ తత్త్వ జిజ్ఞాసద్వారా ఇది ప్రాప్తించును. అప్పుడాత్మ శాంతి సుఖమయ అప్రాకృత ధామమందు ప్రవేశించగలదు.

జయ ఆత్మా ప్రసీదతి.

# భగవద్దర్శనము

భగవంతుని దర్శనము కలుగనంతవరకు జీవితము అసంపూర్ణముగా నుండును. దేహము ఏ విధముగా నేత్రములు కలిగియున్నదో, అదే విధముగా ఆత్మకును నేత్రములు కలవు. వానిద్వారా అది ఆపరమతత్త్వమును తెలుసు కొనగలదు మరియు ఆ భగవంతుని ప్రేమించగలదు. నేత్రములు ఏ విధముగా ఆకాశమును చూచుచున్నవో, అదేవిధముగా విజ్ఞులు సర్వదా ఆపరమ భగవద్ధామమును దర్శించుచున్నారు.

## నా జీవిత పరమాశయము

పవిత్ర మానవ హృదయములో భగవంతుని ప్రతిష్టించుట కేవలము పుష్పములతోను, మంచి గంధముద్వారా మాత్రమేకాక, మాయాపాశములో చిక్కుకొనక, భక్తితో కృష్ణనామమును జపించునట్లుచేయుట - యివియే నా జీవిత పరమాశయములు. పాపముతోను, కల్మషముతోను నిండిన అపవిత్ర హృదయములో భగవంతుని ఆరాధించుటయందు నాకు నమ్మకములేదు. ప్రతి మానవుడు వర్ణాశ్రమ నిమిత్తము లేకయే భగవంతుని ఆరాధించు అర్హత కల్గియున్నాడు. అయితే ఆ ఆరాధన పవిత్రమైనదై యుండాలి. లేనట్లయితే భగవత్ చరణముల యందు అపరాధము కలుగును. మతాచార్యులమైన మేము, భగవదారాధనకు ముందుగా ప్రజలను అనుకూలమైన పవిత్ర మనసు, హృదయము కలవారినిగా చేయుదుము. మనము మానవులలో నిజమైన తాత్త్వికశక్తిని కలిగించు ఆచార్యులుగ ప్రవర్తించవలెను. వారి అభివృద్ధికి మనము చేయూతనివ్వవలెను. మనము వారలకు జీవితపవిత్రత గుర్తెరుగునట్లు చేయవలెను. మరియు ఎంతవరకు మన స్వంత దైనందిన జీవితమును కాయ, వాచ, మనస్సులద్వారా పవిత్రముగా గడపలేమో, అంతవరకు సమాజములో శాంతి, క్రమశిక్షణను సాధింపలేము, స్థాపించలేము. వాస్తవముగ ప్రజలలో ఆధ్యాత్మిక సంపత్తిని ప్రజ్వలింపజేయలేక పోయినచో ఎట్టి శాసనాధికారము సమానత్వమును సాధింపలేదు.

## సరియైన ఆహారము

ప్రతివ్యక్తియు శరీరము, మనస్సు, ఆత్మ అను మూడుభాగములతో గూడుకొని యుండును. మనమందరమును నీ మూడుభాగముల విషయమై తగిన శ్రద్ధ

తీసికొనవలెను. పైమూడుభాగములలో ప్రతి భాగముకూడ తగిన విధమున వృద్ధిలోనికి తీసికొనదగినదియే అయియున్నది. కాని మనము శరీరము యొక్కయు, మనస్సు యొక్కయు నభివృద్ధి విషయములో శ్రద్ధవహించి 'ఆత్మోన్నతి'ని గూర్చి పూర్తిగా విస్మరించు చున్నాము. ఈ కారణముచే ఆత్మనొక భాగముగా కలిగిన శరీరమునందొక వ్రణమేర్పడి, ఆవ్రణము ఆత్మభాగమునే కాక మనస్సు, శరీరములను గూడ విషపూరిత మొనర్చిధ్వంస మొనర్చు చున్నది.

విద్యయొక్కప్రధానోద్దేశ్యము :- మొదటిది మానవుడు తనను తాను తెలిసికొనుట, అనగా తన జీవాత్మను, దాని స్వరూప స్వభావములను గురించి తెలిసికొనుట. రెండవది పరమాత్మను గూర్చి తెలిసికొనుట. మనము మనకు కృతార్థతను కలిగించు ఆధ్మాత్మిక విద్యను నేర్చుకొనుట యందుకంటె, ప్రాపంచిక విద్యను నేర్చుకొనుట యందు సంపూర్ణశ్రద్ధాళువులమై యున్నాము. దీనిఫలితముగా మనకు ప్రాపంచిక చిక్కులు పెరిగిపోవుచున్నవి. ఈ చిక్కులలో నుండి బయట పడుటకు మనమితరములగు ఎన్ని విశ్వప్రయత్నములు గావించినను అవన్నియు, బూడిదలో పోసిన పన్నీరున్యాయమున నిరుపయోగములగుచున్నవి. దీనినుండి ముక్తినిచ్చునది ఆధ్యాత్మిక విద్య యొక్కటియే. ప్రాపంచిక బాహ్యవస్తు సముదాయమునుండి మనకు సుఖముగాని, ఆనందముగాని రాదని మరల, మరల ఋజువు చేయబడినది. కనుక విజ్ఞులు ఆశాశ్వత, నిరవధిక, ఆనంద స్వరూపుడగు పరమాత్మ అనుగ్రహముతో ఆసుఖమును పొందుటకు ప్రయత్నించవలెను. కాబట్టి మనము సర్వకాల సర్వావస్థల యందును భగవచ్చింతనము నందు మునిగి యుండవలయును. ఆ పరమాత్మయొక్క అనంత కల్యాణ గుణములను మనన మొనర్చుకొనవలయును. నేనెవరిని? ఇచటికేల వచ్చితిని? ఈ ప్రపంచములో నీ జన్మమునందు బహుకష్ట పరంపరలనేల ననుభవించుచున్నాను? - అని జిజ్ఞాసాపరులమై యుండవలయును. నిజమునకు యిట్టి ప్రశ్నలు ప్రతి మానవుని అనుక్షణము కలవరపరచుచున్నవి. భగవత్తత్త్వము నెరుంగుట కనువైనది ఈ మానవజన్మమే. కావున ఇట్టి జన్మమును మనము సక్రమముగా వినియోగ పరచుకొనవలెను.

ఈ పాంచభౌతిక ప్రపంచమున మనము జూచువస్తువులన్నియు శాశ్వతములైనవి కావు. అవికొంతకాలము మాత్రమే ఉండి తరువాత నశించును. ఈ ప్రపంచములోని పాంచభౌతిక వస్తువుల యొక్క లక్షణమిది. ఇక మనస్తత్వము

యొక్క స్వరూప, స్వభావములను చూచిన మనస్సు బహుచంచలమైనది. ఒక క్షణములో అనేక భావములు మనస్సునందుత్పన్నమై మరుక్షణములోనే వినాశనమును గూడచెందును. దాహముగొనిన వాడు ఎండమావుల వెంట నీటి కొరకై పరుగిడునట్లు, మనముగూడ సౌఖ్యముకొరకు పరుగెత్తుచున్నాము. దాహము గొనినవాడు ఎండమావుల వెంట ఎంత పరుగెత్తినను నీరుదొరకకపోగా, పరుగెత్తిన ఆయాసమువలన మరింత దాహము గలవాడై బాధపడునో, అట్లే మనము ప్రాపంచిక విషయముల వెంట ఎంత పరుగిడినను, సౌఖ్యమన్నది దొరకకపోగా, మరింత కష్టములనే పొందుచున్నాము.

ప్రస్తుతము మానవులు ఒక విధమగు నాస్తిక దృష్టి కలవారైయున్నారు. జాతి, మత భేదములను, స్వ, పరదేశీయ విభేదములను నశింప జేసికొనవలయునని ప్రతివారును కాంక్షించుచున్నారు. నిజమున కటుల కాంక్షించుట ఉచితమే, ప్రస్తుతకాలమున నిట్టి విశ్వమానవ సౌభ్రాతృత్వ దృష్టి అవసరమని గూడ చెప్పక తప్పదు. నిజమున కట్టి సమత్వ దృష్టిలేనిచో దేశము బహువిధములగు లోగడ జరిగిన అత్యాచారముల యొక్క విషఫలితములననుభవించవలసిన గతి ఏర్పడును. ప్రస్తుత నాగరికతతో గూడిన జీవితమునకే భంగము వాటిల్లగలదు.

శరీర సంబంధమైన అభివృద్ధి, కేవలము తెలివితేటల యొక్క ఔన్నత్యము మానవులను తృప్తి పొందింపజాలవు. పైవాని కన్నను ఆధ్మాత్మిక విజ్ఞానము; తనతోటి మానవుల యందు దయాదాక్షిణ్యములను చూపుట ఇవి మరింత ముఖ్యమైనవి. ప్రస్తుతము రాజకీయముల వలన ప్రపంచములో నిండి నిమిడీకృతమైన అనుమానము, అవిశ్వాసము, పరస్పరద్వేషము - వీనిని తొలగించవలెనన్న ప్రస్తుత మానవునకున్న దృష్టిపథములోనే (మనస్సులోనే) మార్పురావలెను. ఒక మానవునితో మరియొక మానవునకు సమానత్వమును, ఒక జాతితో మరియొక జాతికి సమన్వయము తీసికొని రావలెననిన బెదరింపులచేగాని, బలవంతముగా గాని, కఠినములగు క్రూర మార్గముల నవలంబించుటవలనగాని, యుద్ధములు మొదలైనవి చేయుటచే గాని,ఏమియు అర్ధమాత్రమేని ప్రయోజనముసిద్ధించదు. అట్టి సమానత్వమును సంపాదించ పెట్టగలిగినవి భగవద్విషయములగు భక్తి ప్రపత్తులే.

భారతదేశముయొక్క గొప్పతనమంతయు దానియొక్క ఆధ్యాత్మిక విద్యాసంప్రదాయమునందే గలదు. ఇట్టి సత్సంప్రదాయమును మన పూర్వకాలపు

ఋషీశ్వరులు, మునీశ్వరులు, వేదాంతవేత్తలు జా(గత్తగా తీసికొని వచ్చి, వాని నన్నింటిని మన పవిత్ర మత (గంథములందు, శా(స్త్రముల యందు పొందుపరచి మనకు భద్రముగ నొసంగిరి. కేవల విజ్ఞాన భాగ్యమునేగాక వారి అనుభవములను గూడ దానితో జతపరచి మనకు హస్తగత మొనర్చినారు. మానవజాతి యొక్క మనుగడకు, క్షేమమునకు, నానావిధములుగా వారు మనకొసంగిన ఆ ఆధ్యాత్మిక విజ్ఞానమును, సం(ప్రదాయమును జా(గత్తగా సంరక్షించుకొనుచు, అది ధ్వంసము కాకుండ చూచుకొనవలసిన బాధ్యత భగవత్సేవా పరాయణులమైనట్టి మన భుజస్కంధములపైనున్నది. మానవజాతి (ప్రస్తుత మనుభవించుచున్న వివిధ సాంసారిక దుఃఖములనుండిగాని, కష్టములనుండి గాని విముక్తి జెందవలెనన్న 'పరమాత్మను తెలిసికొనుట' అనుమార్గమొకటి తప్ప వేరు గత్యంతరములేదు. ఇట్టి విజ్ఞానమునకే 'ఆధ్యాత్మిక విజ్ఞానము' అని పేరు. ఆధ్యాత్మిక విజ్ఞానమును సంపాదించగలిగినపుడే మానవుడు విశ్వమానవ సమైక్యతను, సౌ(భాతృత్వమును సాధించగలడు.

శుష్కమగు కర్మాచరణ, ఒకానొక యం(త్రమొనర్చు కార్యమువలె యజ్ఞయాగాది కర్మలను నామమా(త్రముగ వాని సారము నెరుగకుండ, భక్తిరహితముగాజేయుట, భక్తి రహితముగా, మతావేశపూరితముగ వైదికకర్మలను చేయుట -యివిమా(త్రమే (ప్రస్తుతము 'మతము' అని చెప్పుకొనబడుచున్నది. మత విశ్వాసమునకు స్థాయీ భావము అనగా మూలాధారము (ప్రేమ, సేవ, ఐకమత్యము అను మూడింటి కలయిక కనుక మతమే మానవజాతియొక్క జీవితమునకు ముఖ్యాధారము అయినది. ఇట్టి మతమును మానవుడెప్పుడు (త్రోసిరాజునునో, అపుడే కేవలనాస్తికత్వము (ప్రబలి మానవజాతికి మృత్యువాసన్న మగును. మానవజాతికెవడు ఆధ్యాత్మికవిద్య (ప్రదానమొనర్చునో, మానవ జాతినెవడు ఆధ్యాత్మిక చింతాపరాయణమైన దానిగానొనర్చి భగవద్భక్తి పూర్ణమైన దానిగా నొనర్చునో, అతడే యథార్థముగా సంఘమునకు మహోపకారము చేసిన వాడగును.

ఏ భారతదేశము యొక్క సాంఘిక నిర్మాణము, రాజకీయ దృక్పథము, ఆర్థిక పద్ధతులు మొదలైన వానిని చూచి (ప్రపంచమునందు గల భారతే తరదేశములన్నియు ఓర్వలేనితనమును చూపెనో, భారతదేశము యొక్క అట్టి మహోన్నత్యమున కంతటికిని మూలకారణమైనది భారతావనికి గల యాధ్యాత్మిక విద్యా సంపత్తియే.

ఇంతవరకు భారతదేశము ఆధ్యాత్మిక విషయమునకట్టి అగ్రస్థానమిచ్చు చూవచ్చుచుండెను. కేవలము భౌతికాభివృద్ధికిగాని, మానసికాభివృద్ధికిగాని, ఆధ్యాత్మిక విషయముల కిచ్చినంతటి అగ్రస్థానమును భారతదేశమీయలేదు. ఇతరదేశములు ఎంతటి భౌతిక సంపత్తిని కలిగియున్నను, ఎంతటి మానసికా భివృద్ధిని కలిగియున్నను, అవి అన్నియు ఆధ్యాత్మిక సంపత్తిని కలిగియున్న భారతదేశము నణుమాత్రమేని చిన్నచూపుతో చూడలేక పోయినవి. పైగా భారతదేశమే మిగిలిన దేశములన్నింటిని తనయొక్క ఆధ్యాత్మిక బలముతో లొంగదీసుకొని, వానిపైన సవాలుచేసి వానినన్నింటిని తనకు పాదాక్రాంతులునుగా చేసికొనగలిగెను.

భారతదేశము ప్రస్తుతమున్న సాంఘికవ్యవస్థను, రాజకీయ దృక్పథమును మార్చుకొని మానవజాతి యొక్క యోగక్షేమముకొరకు తన యొక్క మానసిక సమత్వమును యథాపూర్వకముగ పొందవలెననిన అది ఆధ్యాత్మిక తత్త్వవిజ్ఞాన సంపాదనమువలననే సాధ్యమగునేకాని మరియే యితర మార్గాలద్వారా సంభవముకాదు.

## పూర్ణతమ శ్రీకృష్ణుడు

అఖిలరసామృత మూర్తియైయున్నవాడు (అనగా శాంతము, దాస్యము, సఖ్యము, వాత్సల్యము, మధురము అను ఈ ఐదు ముఖ్యరసములను, హాస్యము, అద్భుతము, వీరము, కరుణము, రౌద్రము, భయానకము, బీభత్సము - అను ఈ ఏడు గౌణచిన్మయ రసములకు ఆశ్రయ రూపమగు పరమానందమునకు మూర్తీ భవించిన విగ్రహుడై యున్నవాడు), ప్రసారమగు తనకాంతిచే తారక, పాలి అను గోపికలను వశపరచుకొనినవాడు, శ్రీమతిరాధికకు ప్రియతముడై యున్నవాడునగు శ్రీకృష్ణచంద్రుడు జయమును పొందుచున్నాడు.

శ్రీరఘుపతి ఉపాధ్యాయులు ఈ విధముగా వర్ణించిరి :- 'శ్రుతిమపరే స్మృతిమపరే....' అనగా ఏ నందమహరాజు గారి ఇంటివాకిటలో శ్రీకృష్ణ పరమాత్మ యొక్క లీలలను ప్రదర్శించెనో ఆనంద మహారాజుగారి పాద కమలములకు నమస్క రించెదను. నాకు శ్రుతులతో పని లేదు, స్మృతులతో పనిలేదు. తుదకు ప్రాపంచిక భయరహితమగు ముక్తితో గూడనాకు పనిలేదు. నాకుకావలసింది శ్రీకృష్ణుడొక్కడే. అతడు తప్ప అన్యము నాకేమియు అక్కరలేదు.

శ్రీకృష్ణుని పూర్ణతమ స్వరూపము శ్రీనందమహారాజుగారి ఇంటియందు గాననగును. ఒక్క శ్రీమద్భాగవతము నందు మాత్రమే శ్రీకృష్ణతత్త్వము, యథార్థముగా గన్పించును. ఆ శ్రీకృష్ణుని యొక్క రూపము, దుస్తులు, ఆభరణములు మొదలయినవిగాని గోపికలతో శ్రీకృష్ణుడు సల్పిన లీలలుగాని, గోపబాలురతోడను, గోగణములతోను శ్రీకృష్ణుడు ఆటలాడిన తీరుగాని, ఇవన్నియు అప్రాకృతలీలలేగాని ప్రాకృతలీలలు గావని శ్రీకృష్ణచైతన్య మహాప్రభువు నిరూపించి యున్నారు. శ్రీకృష్ణుని లీలలన్నియు అప్రాకృతములు, దివ్యములగుటచే ప్రాపంచిక తర్కదృష్టిచే వానిని పరస్పర విరుద్ధములని ఖండించుటగాని, వానిని నిరాకరించుటగాని చేయదగిన పనిగాదు. పరస్పర విరుద్ధ విషయములు గూడ ఆయన యందు సమన్వయములగును. ఆయన అప్రాకృత స్వరూపుడే. అట్లే ఆయనకు, ఆయన శరీరమునకు భేదము లేదు. శ్రీకృష్ణుని శరీరము సచ్చిదానంద స్వరూపము.

శ్రీకృష్ణుని పూర్ణతమ స్వరూపమును తెలిసికొనుటకు 'శుద్ధభక్తి' ఒక్కటియే సాధనము. బృందావనము నందు ఆవిర్భవించిన ఆయన పూర్ణతమ స్వరూపము, లీలా స్వరూపిణి యగు శ్రీమతిరాధికద్వారానే తెలియబడగలదు. శ్రీకృష్ణుడు తననామ, రూప, గుణ, లీలలను ఆమెద్వారానే ప్రదర్శింపజేయును. ఎంతవరకు ఆమె అనుగ్రహమును పొందలేమో సమస్త కృష్ణలీలలు అంతవరకు మాయికము గను, అగమ్య గోచరముగను తోచును. ఆమె శ్రీకృష్ణుని యొక్క అప్రాకృత ఇచ్ఛాశక్తి స్వరూపమే.

సాక్షాత్తు శ్రీకృష్ణుడె శ్రీకృష్ణచైతన్య మహాప్రభువుగా అవతరించి, శ్రీమతిరాధిక శ్రీకృష్ణుని ఆరాధించిన ప్రేమ భక్తిని, వారి పరస్పర సంబంధమును గూర్చి జగజ్జీవులకు తెలియజేసిరి. శ్రీరాధాకృష్ణులకు గల ఈ ప్రేమ తత్త్వస్వరూప మంతయు మహాభావ స్వరూపిణి యగు శ్రీమతి రాధికయందు మూర్తీభవించినది. దీనినిబట్టి రసరాజు శ్రీకృష్ణుడు, మహాభావ స్వరూపిణి శ్రీమతి రాధిక, వీరిరువురును ఒకే మహత్తత్త్వమేగాని, విభిన్నతత్త్వములు కావు అని తెలియుచున్నది.

ఎప్పుడైతే అతని నామమును ఆశ్రయించి, నిష్కపటముగా కీర్తించుచూ, పూర్వమహాజనుల ఆదేశానుసారము ఆత్మవంచన, పరవంచనలేక జీవితము గడుపుదమో, ఆపూర్ణతమ శ్రీకృష్ణుడు అప్పుడు మన హృదయములలో బంధింప బడును.

## జీవితసమస్యలను పరిష్కరించుటెట్లు?

మానవ జీవిత సమస్యలను, వాని పరిష్కారమునకు చేయుప్రయత్నములు చూచినచో మానవుని ముఖము మీద ఆశారేఖలు కన్పించుచునే యున్నవి. శాంతి సాధనకై చేయుప్రతి ప్రయత్నము చివరకు క్లిష్టతరముగా తయారగుచున్నది. రాజకీయమున చూచినచో మనలో ఎన్నియో అసంఖ్యాకములైన రాజకీయపక్షము లేర్పడినవి. నేటి సంఘములోని దోషములను నివారింపగలమని చెప్పుచున్నవి. సంఘమనెడి ఓడ తన పూర్వపు ఆశ్రయములను గోల్పోయి, తనలోపములను సర్దుకొనుటకు కావలసిన ప్రశాంతమైన స్థలముకొరకు వెదకుచున్నది. ప్రతిదినము సంఘము అనేక భాగములుగ చీలిపోవుచున్నది. ప్రతివ్యక్తియు తన స్వార్థమే చూచుకొనుచూ తానే ప్రపంచములో ప్రధానవ్యక్తిగా భావించుచున్నాడు. పురాతన మైనవియు, సంప్రదాయ బద్ధమైనవియునగు మతపద్ధతులు నశించి పోయినవి. వ్యక్తిత్వముసరిగా లేనట్టియు, భవిష్యత్తు నిరాశాజనకముగా నున్నటియు, ఉన్నది ఉన్నట్టుగా ప్రపంచమును గ్రహించవలెనని అనుకొనుచున్నట్టి మానవుని నేటి దుర్భర స్వాప్నిక జగత్తులో, ఆపరమాత్మ యొక్కడే సర్వులకు ఆధారుడు.

ఆధునిక మానవులు అజ్ఞేయవాదము, సంశయవాదము ద్వారా ఆకర్షితులు. మరియు మనదేశములో దేహమును ఆత్మగా తలచువారున్నారు. ఆధ్యాత్మికమైన మనదేశములో కూడ మానవుడు దేహ, మనస్సు, బుద్ధులకు అతీతమైనది ఒకటి ఉన్నది అని తెలుసుకొనలేకపోయాడు.

## మరీచికవైపు పరుగెత్తకు

కర్మలయొక్క బయట మెరపులచే నాకర్షింపబడినవారమై, కర్మాభాసములైనట్టి నామమాత్రకర్మల నాచరించుటయే నాగరికత యనిభ్రమించి, కర్మలయొక్క అంతరార్థమును గ్రహించలేక చెడిపోవుచున్నాము. కాని కొంచెము జాగ్రత్తగా విచారణచేసినచో, పైవిధముగ పైపై మెరపులచే నాకర్షింపబడి కర్మలను చేయుట అనునదియే ప్రస్తుత నాగరిక ప్రపంచమునంతను ధ్వంసము చేయు వేరు పురుగని బుద్ధిమంతులు గ్రహించగలరు. కనుక కర్మయొక్క యథార్థతత్త్వము నెరుంగజాలని వారు బోధించు బోధనలన్నియు జీవులకందరకు ఉద్ధారమార్గమును జూపకబోగా జీవలోకమును కర్మబంధనములలో చిక్కుకొనునట్లుచేసి మరింత

అధోగతి పాలుజేస్తున్నవి. నిజమునకు కర్మల ఉద్దేశ్యము భోగముకాదు. అటుల ఆలోచించుట పొరపాటు. కర్మలయొక్క ముఖ్యోద్దేశ్యము - ఆత్మప్రబోధమువలన ఆత్మశుద్ధినిగావించి, జీవులను భగవత్తత్త్వ జిజ్ఞాసువులుగా చేయుటయే అని ఎరుంగవలెను.

భగవత్సేవకుపకరించు ఈ శరీరమును మనము జాగ్రత్తగా కాపాడుకొనవలెను. ఈ శరీరము దేవాలయమువంటిది. మన బుద్ధి, శరీరము, ధనము, మనస్సు మొదలగునవి భగవంతుని సేవకొరకే సృష్టింపబడినవను విషయమును సంపూర్ణముగ మరచిపోయినాము. అట్లుగాక వానిని మన సౌఖ్యముకొరకు వినియోగించుకొనినచో లేదా జీవితాంతము మనయొక్క సౌఖ్యము కొరకని సేకరించుకొనిన వస్తువులనన్నింటిని ప్రాణ ప్రయాణ సమయమున జూచుకొని దుఃఖ సముద్రములో మునుగవలసినదే. భగవంతుడు తనతత్త్వము నెరుంగుటకు కావలసిన సూక్ష్మబుద్ధి మొదలగు సాధన సామాగ్రిని మానవులకు ప్రసాదించెను. మానవేతర జీవులకు అట్టి సదుపాయములులేవు. ఇతర జీవులు మంచిచెడుల యొక్క వివేచన చేయలేవు. అందుచే అవి ఎన్నో బాధలు అనుభవించు చున్నవి. అట్లుగాక మంచి చెడుల వివేచన జ్ఞానముతో కూడిన మనము భగవత్సేవను మరువగూడదు. భగవత్సేవయందు అశ్రద్ధ చూపకూడదు. కారణము జీవరాశులలో కెల్ల ఉత్తమమగు మానవులకు మాత్రమే భగవత్సేవా సదుపాయములు, అవకాశములు గలవు.

జీవులకును, జగత్తునకును మేలు కలిగించుటకొఱకు భగవానుడు స్వయముగగాని, శాస్త్రరూపమున గాని ప్రకటుడగును. వేదశాస్త్రములు భగవంతుని ఆవిర్భావ విశేషములు. వేదశాస్త్రములు అద్వయజ్ఞానతత్త్వ స్వరూపుడగు వ్రజేంద్రనందుని అభిజ్ఞాన విగ్రహరూపముతో ఆవిర్భవించును.

వేదమే అద్వయజ్ఞాన స్వరూపుడగు భగవంతుని శబ్దావతారము. వేదవాణి భగవంతుని ముఖారవిందము నుండి వెలువడిన వాణి. వేదానుగత్యమే భారతదేశ సభ్యతకు, సంస్కృతికి రహస్యమైయున్నది. వేదశాస్త్రమే ప్రమాణము (Authority). శబ్దప్రమాణమునకు మరియొకపేరు వేదప్రమాణము లేక శ్రుతిప్రమాణము. శ్రుతిశబ్దముచే వేదమునకు శిరోదేశమైన ఉపనిషత్తే అని చెప్పబడినది. అప్రాకృత

వస్తువును నిర్ణయించుటలో లౌకికప్రమాణము అంగీకరింపబడదు. షడ్ దర్శనములు లేదా ఇతర ప్రమాణములు శబ్దప్రమాణమును అనుసరించినవి యైనచో అంగీకరింపబడును. అట్లుకాని పక్షమున అంగీకరింపబడవు. మానవుల మేధాశక్తి భ్రమ, ప్రమాద, విప్రలిప్సా, కర్ణాపాటవములను దోషచతుష్టయముతో కూడినది. (These are interest in human intellect.) మఱియొక పక్షమున వేదశాస్త్రములు అపౌరుషేయములు-దోషచతుష్టయము లేనివి (free from all these defects) అందువలన శ్రుతి ఈ విధముగా ఘోషించుచున్నది.

"త్వమేవ విదిత్వ అతిమృత్యుమేతి నాన్యపంథా విద్యతే అయనాయ"

ఇది వేదములోని విషయము. భగవంతుని తెలిసికొనగలిగినపుడు మృత్యువాత నుండి రక్షింపబడవచ్చును. శ్రుతియందు చెప్పబడిన మార్గము తప్ప మఱియొక మార్గములేదు.

శ్రుతి యందు బ్రహ్మవస్తువు అనగ ఏమియో దానినిగూర్చి విశేషముగా చెప్పబడినది. ప్రాగ్వైదిక యుగమునుండి మనీష గల వారందరు మానవ కల్యాణార్థమై ఆత్మవినియోగముచేసి ఈ విషయమును గూర్చియే పరిశీలించిరి.

బ్రహ్మవస్తువును గురించి శంకరాచార్యులు చర్చించి, అదినిర్విశేష, నిర్గుణ, నిఃశక్తి మరియు నిరాకారమని నిర్ణయించిరి. శంకరాచార్యుల సిద్ధాంతము వేదవిరుద్ధమనియు, బ్రహ్మము నిర్విశేషము కాదనియు, నిఃశక్తి లేక నిరాకారము కాదనియు శ్రీమన్మహాప్రభువు చెప్పిరి.

శ్రీలసనాతన గోస్వామిపాదులకు శ్రీమన్మహాప్రభువు ఈవిధముగ చెప్పిరి. అప్రాకృత శరీరధారియగు భగవంతుని ఆవిర్భావము జీవులబుద్ధికి అగమ్యము. ఈ పథవి (ప్రపంచము) ఏ నిమిత్తము సృష్టింపబడినది? This world is a place of spiritual salvation. పరమార్థమును పరిశీలించుటకును, ధర్మజీవనమును పాటించుటకును ఈ జగత్తు సృష్టింపబడినది.

శ్రీచైతన్య మహాప్రభువు భాగవతధర్మమును గూర్చియు, వేదధర్మమును గూర్చియు జగత్తులో ప్రచారము చేసిరి. వేదముల యొక్క శిరోభాగమే ఉపనిషత్తులు. దానికి భాష్యము స్వయముగ వ్యాసదేవుడే వ్రాసెను. శ్రీచైతన్య

మహాప్రభువు ప్రచారము చేసిన ధర్మము సార్వదేశికము, సార్వకాలికము, సార్వజనీనము. ఈ ధర్మము కుల ధర్మముగాని, లౌకిక ధర్మముగాని, పారలౌకిక ధర్మముగాని కాదు. ఇది విశ్వకల్యాణమును కలిగించుటకొఱకు సర్వమానవులకై ఏర్పడినది. ఈ ప్రేమ ధర్మము ఒక వర్ణము నకు సంబంధించిన వారు కాని లేదా ఒక ఆశ్రమమునకు సంబంధించినవారుకాని పాటింపదగినదికాదు. ఈ ధర్మమునకు స్థానాస్థానభేదములేదు. ఆబాల, వృద్ధ, వనితలు, కీటపతంగాది భేదములేక జీవకోటియంతయు పాటింపదగినది. ఇది దేహధర్మముగాని, మనోధర్మము గానికాదు. ఇది ఆత్మధర్మము, సనాతన ధర్మము, జీవుని ధర్మము.

"శృణ్వన్తు విశ్వే అమృతస్య పుత్రాః" అని శాస్త్రము చెప్పుచున్నది. ఈ నాలుగు శబ్దములు తాత్పర్యముతో కూడినవియై యున్నవి. " We are the fragments of the divine sun of immortality. కనుక "సో హంబ్రహ్మ" వేదాంతమునకు ప్రతిపాద్య విషయముకాదు. మనమందరము అమృత సంతానము. మాయాబద్ధజీవేర 'నాయ కృష్ణస్మృతి జ్ఞాన" మాయాబద్ధులైన జీవులకు కృష్ణ స్మృతిజ్ఞానముండదు.

శ్రీభగవంతుడే ఆరాధ్య వస్తువు. ఆయన సచ్చిదానంద విగ్రహుడగు శ్రీకృష్ణుడు. అతని ఆరాధనచేతనే త్రితాపములు నశించి శాశ్వతమైన ముక్తికలుగును. భగవదారాధన వలననే పరాశాంతి లభ్యమగును. భారతదేశములో ఉన్న ధర్మమునకు, సభ్యతకు, సంస్కృతికి పునాది ఏది? దీనికి సమాధానము ధర్మము అయితే అది ఏధర్మము? శ్రీచైతన్య మహాప్రభువు ముక్తకంఠముతో ఈ దార్శనిక పండితులు నిర్ణయించిన పరమార్థము పరమార్థముకాదని షడ్ దర్శనములు నిర్ణయించిన తత్త్వమును ఖండించిరి. ప్రభువు ఇంకను ఈ విధముగ చెప్పిరి.

'తాఁతె ఛయ దర్శన హఇతే తత్త్వనాహిజాని' షడ్ దర్శనముల వలన తత్త్వము తెలియబడదు. తత్త్వము ఆరాధ్య వస్తువు. శ్రీసనాతన గోస్వామి శ్రీమన్మహా ప్రభువును ఈ విధముగ అడిగిరి. 'కేఆమి, కేనమోరే జారే తాపత్రయ' నేను ఎవరిని? నన్ను తాపత్రయములు ఎందుకు పీడించుచున్నవి. ఇంకను ఇట్లు

అడిగిరి. జీవుని స్వరూపమేమి? మాయాబంధనమునుండి జీవుడు నిష్కృతి పొందుటకు మార్గమేది? ఈ ప్రశ్నలకు సమాధానముగ శ్రీచైతన్య మహాప్రభువు శ్రీలసనాతన గోస్వామికి ఇట్లు సమాధానము ఇచ్చిరి.

"జీ వేరస్వరూప హయకృష్ణేర నిత్యదాస।
కృష్ణేర తటస్థాశక్తి భేదాభేద - ప్రకాశ" ।

ఆయనను సేవించుటయే జీవుల ధర్మము.

శ్రీమన్మహాప్రభువు ఇంకను ఇట్లునుడివిరి.

శ్రీకృష్ణదాసత్వమే జీవులకు నిత్యస్వరూపము. పరమతత్త్వ అప్రాకృత శరీరధారి శ్రీకృష్ణుడు. అతనిని సేవించుటయే జీవుల ధర్మము.

శ్రీమన్మహాప్రభువు ఇంకను ఇట్లు నుడివిరి.

"వేద శాస్త్ర కహే - సంబంధ, అభిధేయ, ప్రయోజన"

"వేద శాస్త్రములు భగవంతుని గూర్చిన సంబంధము, అభిధేయము, ప్రయోజనములను గూర్చియే చెప్పుచున్నవి. శ్రీలకృష్ణదాస కవిరాజ గోస్వామి పాదులు శ్రీచైతన్యచరితామృతములో ఈ విషయత్రయమును విపులీకరించి చక్కగ వ్యాఖ్యానించిరి. ఈ మూడు విషయములే పూరకమైనవి (Complementary).

# దేవుని సరియైన గుడి

భౌతిక విషయములకు ప్రాముఖ్య మిచ్చెడి విదేశములో కూడ బర్క్ మహాశయుడు ఇట్లు వ్రాక్రుచ్చెను.

మతమే సంఘ సంక్షేమమునకు మూలాధారము. దానిమీదనే నిజమైన పౌరప్రభుత్వము వికాసము నందగలదు. దానినుండియే యధికారులకు శక్తిసామర్థ్యములు లభింపగలవు. న్యాయచట్టమునకు అభ్యుదయము వచ్చును. అప్పుడు రెండును ఉత్తమ ఫలితములనీయగలవు. ఒకసారి మతప్రాముఖ్యము మరుగున పడినచో దాని ఎడల నిర్లక్ష్యభావము నెలకొనినచో, ఆ సంఘము సుస్థిరత్వము నందజాలదు. శాశ్వతముగా నుండజాలదు. వాషింగ్టన్ మనిషి కూడ యిట్లే హెచ్చరిక చేసెను.

“అన్ని అలవాట్లతోను, పరిస్థితులలోను మత ప్రాముఖ్యము సంఘమును బాగుపరచగలదు.” రాజకీయ స్థిరత్వమునకు మతము, నైతిక జీవితము అవసరము. మానవ జీవిత శాంతి సౌఖ్యములకు దోహదకారియైన యీ మతప్రాముఖ్యమును మరచినవాడు నిజమైన దేశభక్తుడనిపించు కొనడు. మత మేదైనప్పటికి, జాగ్రత్తగా పరిశీలించినచో నైతిక జీవితము యొక్క ప్రాశస్త్యమును తగ్గించరాదు. మతప్రాముఖ్యమును విడనాడి నైతిక జీవితమును గడుప గలమని యనుకొనుట యొక సాహసమే కాగలదు.

భగవంతుని సాన్నిధ్యము చేరుకొనుటకు మనము చేయు ఆధ్మాత్మిక ప్రయత్నములలో మతము లేక ధర్మమునకు అభ్యుదయము గలుగవలెననినచో రెండు కష్టముల నుండి గట్టెక్కవలెను.

అవియేమనగా :- మతోన్మాదము మఱియు నాస్తికత్వము.

ఆ కష్టములను అధిగమించిన యెడల ఆంతరంగిక,బహిరంగిక, ఆధ్మాత్మిక విప్లవ పరిణామములను సాధించి భగవంతుని సాన్నిధ్యమును చేరుటకు అవకాశము కలుగును. ఈ ఆంతరంగిక, బహిరంగిక లక్షణములు రెండును పరస్పర సాహాయకారులు.

అప్పుడు శాస్త్ర విషయములు, మత విషయములు రెండును ఒకే ఒక సమగ్ర సత్యస్థితినిరూపణమునకు దోహదములగును. “పూర్ణమదః” అని కదా

ఉపనిషద్వాణి. ప్రపంచములోని ప్రతివస్తువు ఏదో యొక యుద్దేశ్యముతో నిర్మింప బడినదను భావముతోగాని, శాస్త్రీయ దృక్పథముతో గాని పరిశీలించినచో ఈ విషయము స్పష్టమగుచున్నది. భగవత్ సాన్నిధ్యమును చేరుకొనుటకు చేయు ఈ ప్రయాణములో అనవసర ఆడంబరములకు ఇది ఎంత దూరముగ ఉండునో భగవంతుని గుఱించి స్పష్టముగా తెలిసికొనుటకు యంత ఉపయోగించును. శ్రీకృష్ణనామస్మరణము జరుగు సత్యదేవాలయము కలదు. అది ప్రపంచ భగవన్మందిరము. అచ్చట కృష్ణ నామ సంకీర్తనము చేసికొనుటకు అందఱకు హక్కు గలదు. ఆ గుడిలో ప్రవేశించుటకు ఏ జాతి వారికిని ఎట్టి నిషేధాజ్ఞయులేదు.

ఈ ప్రపంచమే దేవాలయము అనునది శ్రీ చైతన్య మహా ప్రభువు భావన-ఆయన మత భావములు భారత దేశమునకు మాత్రమే పరిమితములు గావు. అవి సార్వజనీనములైనవి. ప్రేమ, భగవత్సేవ ఈ రెండు ఆయన అమూల్య సిద్ధాంతములు.

ఆయన బోధనలో ప్రాముఖ్యము వహించినవి- ఒకరి మనస్సును సహకార సాహాయ్య క్రియల ద్వారా వశపరచు కొనవచ్చును. పోటీతో, స్పర్ధతో వశపరచు కొనుట కష్టము. ప్రేమతో, భగవత్సేవానిరతితో ఆకర్షింపవచ్చును. ప్రతిఫలాపేక్ష లేకుండా దైవమునకు సర్వాత్మ సమర్పణ చేయుటయే భగవత్సేవ.

పునరపి జననం, పునరపి మరణం జరుగకుండ ఉండవలెననినచో, ఆత్మ సౌందర్యమును, సంతోషమును గ్రహింప వలెనననినచో, భగవద్విషయముల గుఱించి సత్యము సంపూర్ణముగా గ్రహింపవలసి యున్నది. అప్రాకృతశక్తి సంపద కలిగిన భక్తి పరముగా సాధింపవలసి యున్నది.

భగవత్ప్రేమలోనే జీవిత సర్వస్వమాధారపడి యున్నది. అతనినామస్మరణమే చిత్త శాంతికి ఈ లోకమున దారి చూపుచున్నది.

ప్రపంచములో మనఃస్వాస్థ్యము లభింపవలెనననినచో ప్రేమ, భగవత్సేవానిరతి అత్యవసరమని చెప్పుటే శ్రీ చైతన్య మహాప్రభువు యొక్క బోధనా సారాంశమై యున్నది.

# దివ్యవాణి

మన దేశము రాజకీయ సంక్షోభములో ఉన్న సమయములో కూడా తత్త్వము, తత్త్వ విచారము ప్రాబల్యముగ వుండెననుటలో సందేహము లేదు. మానవుడు ఈ భౌతిక సుఖములను వాంఛించి, అదే పరమావధిగా భావించి, వానినుండి విడదీయరాని బంధనము ఏర్పరచుకొనుచున్నాడు. అది ఆధ్యాత్మికమైన ఆత్మహత్యే అవుతుంది. మానవుడు తాను అనుభవించుచున్న సుఖములుగా పిలువబడే యీ విషయములు శాశ్వతమైనవనే భావించుచున్నాడు. ఇది అంతయు "భ్రమ" మాత్రమే.

మానవుడు మానవత్వముతో జీవించుటకు మతము కంటె శాస్త్రమునకే ప్రాముఖ్యము గలదు. (శాస్త్రమనగా శాసించునది, విధి నిషేధములు గలది) తత్త్వము, మతము వాస్తవమైన శాస్త్ర విషయములను గ్రహించుటకు, మానవుని యొక్క వాస్తవ ధర్మమును తెలుసుకొనుటకు సహాయపడు ననుటలో సందేహము లేదు.

క్రింది స్థాయికి చెందిన మానవకోటి యింద్రియ సుఖముల కొరకు మాత్రమే శ్రద్ధ తీసుకుందురు. విజ్ఞులు, ఆధ్యాత్మిక వీరులు మాత్రమే పై స్థాయిలో నుందురు. మానవుడు ఎప్పుడునూ తాను సాధింపదగిన వస్తువును గురించి ఎక్కువగా ఆలోచింపడు. ఆలోచించినచో అది సాధ్యమే. తాను అవలంబించు మతమును సరిగా అర్థము చేసికొని ఆచరణలో పెట్టిననాడు ఆధ్యాత్మిక వారసత్వమును పొందినవారగుదుము.

సాధన చేసినచో సాధ్యవస్తువును మనము పొందగలము. ఈ సృష్టిలో ప్రతీ వస్తువు మార్పుచెందుతూనే వుంటుంది. కానీ మానవుడు చేయదగినది భగవంతుని పట్ల విశ్వాసము కలిగియుండుట శరణాగతి మాత్రమే ఆఖరికి మానవుని రక్షించునది.

భౌతికముగా భారతదేశము సంపన్నదేశము కాకపోవచ్చు. కానీ ఆధ్యాత్మ రంగములో మాత్రము ఏ దేశము ఎదగనటువంటి శిఖరములకు చేరుకొన్నది. యీ దేశము పురాతన ఆచారములు, వారసత్వ సంపదను యుగ యుగముల నుండి కల్గియున్నది. ఎందుకనగా భగవంతుని యొక్క ఆశీస్సులు ఉండుటచే.

యీ దేశమునకు వాస్తవమైన మతము కలిగియుండుట, శాంతి, సహనములను విషయములను ప్రపంచ మానవాళికి చాటి చెప్పుచున్నది.

సాధుపురుషులు అనుసరించవలసిన ముఖ్యమైన కర్తవ్యము ఒకటి వున్నది. ఏమనగా ప్రజలను ఆధ్యాత్మిక సంపన్నులుగా చేయుటలో వారి పాత్ర ఎంతైనా ఉందని చెప్పుటకు సందేహపడనవసరములేదు. కానీ ఎంతమంది యీ అవకాశమును అనగా సాధుపురుషుల వాస్తవమైన సత్యమును గ్రహించి వారి ఆధ్యాత్మిక సంపద పెంచుకొనుటకు ముందుకు వచ్చు అవకాశమును వినియోగించుకొంటే అంత మంచిది.

# శ్రీ చైతన్య సిద్ధాంతము

ప్రస్తుతము ప్రచారములోనున్న మతసిద్ధాంతములన్నియు దాదాపు వేదము నాధారముగా గలిగినవే. భారతవర్షపు విజ్ఞానమునకు సంబంధించినట్టియు. భారతవర్షపు సారస్వతమునకు సంబంధించినట్టియు సర్వవిషయములకు తొలియాధారములు పురాతనములగు వేదములేయను విషయము మన మెఱింగినదే. అట్టియా వేదములనుండి యుత్పన్నములైనవే భారతీయ మతములన్నియు. ఆధ్యాత్మికములగు భిన్నభిన్న యభిప్రాయము లెన్నెన్ని యుత్పన్నములైనను, వానికన్నింటికిని ఆధార భూతములైనవి వేదములే. కాని ఈ వేదముల యొక్క యథార్ధ స్వరూప, స్వభావము లెట్టివో యవ్వాని విషయమై మనలో చాలమందికి అనిశ్చితాభిప్రాయమే గాని నిశ్చితాభిప్రాయములేదు. పరతత్త్వమునకు సంబంధించిన విజ్ఞానమునకు ఆధారములు వేదైక దేశములగు నుపనిషత్తులే. ఈ ఉపనిషత్తులకే "వేదాంతములు" అనికూడ పేరుగలదు. ఇవి యన్నియు భారతీయ సారస్వతమునకు సంబంధించిన గ్రంథ సముదాయములే. కాని యావేదములయొక్క యథార్ధతత్త్వమును, భావమును గ్రహించు విషయమున నొక నిర్ణీతమగు పద్ధతి యనునది లేక చాలమంది వానియర్ధ నిర్ణయము విషయమున చాల పొరబడి, వానికి అపార్ధములను కల్పించిరి. విరుద్ధార్ధములను గూడ చెప్పిరి. దానికి కారణము వేదములకర్ధము, వేని నాధారముగ చేసికొని చెప్పవలయునో వాని నాధారముగ చేసికొనక, యేకట్టు బాట్లకు లోనై వేదములకర్ధమును జెప్పవలయునో, ఆకట్టుబాట్లకు లోనుగాక,

ప్రేమ రూపమగు భక్తి మార్గమును ఉపదేశించుచున్నది. అయ్యది జీవుల హృదయములలోని అజ్ఞానమును తొలగించి, భగవదనుభూతిని కలిగించి, శాశ్వత మగు పరమశాంతిని చేకూర్చును.

వేదవ్యాసుడు వేదములను విభజించినప్పటికిని, పంచమవేదమనబడు మహాభారతమును వ్రాసియుండినను, అవ్యక్తమగు మనోవ్యాకులతకు గురి యయ్యెను. మరియు బ్రహ్మ సూత్రములను, అష్టాదశపురాణములను, ఇతిహాసము లనెన్నింటినో రచించినను ఆయనకు మనశ్శాంతి, సంతృప్తి కలుగలేదు. ఆ సమయమున నారదమహర్షి యచట కేతెంచి, వ్యాసులవారు రచించిన గ్రంథములన్నియు గూడ భగవంతుని యొక్క గుణ, లీలలను గూర్చిగాని, భగవద్భక్తుల చరిత్రలకుగాని ప్రాధాన్యము లేక ఇతర ధర్మములను బోధించునవిగా యుండినవిగాన నదియే ఆయన మనస్తాపనకు కారణమని జెప్పెను. నారదుడు హరిభక్తుల సాంగత్యము వల్ల నెట్లు తరించునో ఆ కథను గూడ వివరింపగా వ్యాసుడు విషయమును గ్రహించి, భగవంతుని ధ్యానించి, సమాధిలోనుండి ప్రత్యక్షానుభవముతో భాగవతమును రచించెను. అట్టి భాగవత గ్రంథమునే తన పుత్రుడగు శ్రీశుకదేవునకు బోధింపగా అది శుకులవారు పరీక్షిన్మహారాజునకు అందించెను. బ్రహ్మజ్ఞానియగు శుకదేవుని గూడ భక్తి మార్గము వైపు మరలించి, భక్తి యొక్క ఉత్కృష్టతను బోధించునట్లుగా జేసినట్టి ఈ భాగవతగ్రంథము ఎంతటి మహత్తరమైనదో మనమూహింప వచ్చును. బ్రహ్మ సూత్రముల యొక్క వ్యాఖ్యానమే శ్రీ మద్భాగవతము. ప్రపంచములోగల ఉత్తమ గ్రంథములలో ఇది ఒకటి. మానవులకు తమ జీవిత పరమార్థమును బోధించి తత్త్వమును సులభముగ అవగాహన చేయు శక్తి భాగవతమునకు గలదు. ఇందు ముఖ్యముగా పరమాత్మకు ఆధారభూతమైన స్వయం భగవంతుని యొక్క రూప, గుణ, లీలలు వర్ణింపబడినవి. భాగవత రచనా కౌశల్యము కవిత్వములో మేటి. వేదాంత చర్చలో దానికదియే సాటి. భారతదేశములో ఈ గ్రంథమునకు భగవద్గీత కంటె మిక్కుటముగా ఆదరణ గలదు. ఏలననగా "సర్వధర్మాన్ పరిత్యజ్య" అను శ్లోకములో గతి అంతమయినది. సమస్త కర్మలను వదలి భగవంతునొక్కనినే పరిపూర్ణ భక్తితో శరణుబొందవలెనని గీత బోధించుచున్నది. శ్రీ మద్భాగవతము సమస్త ధర్మములను వదలిన తరువాత భగవంతుని ఎట్లు సేవింపవలెనో తెలియజెప్పును. సామాన్య మానవుని వలె జగత్కర్తయగు పరమేశ్వరుడు చేసిన అద్భుత లీలను శ్రీమద్భాగవతము కొనియాడినది. భాగవతము యొక్క సారాంశమంతయు మొదటి మూడు శ్లోకములలో చెప్పబడియున్నది.

భాగవతములోని మొదటి శ్లోకము జీవునకు, భగవంతునకు గల అప్రాకృత సంబంధమును, జీవుడు మాయామోహముచే శాశ్వతమగు భగవత్సేవనుండి, తన విద్యుక్త ధర్మము నుండి చ్యుతుడైన విధము వివరింపబడెను. ఈ పంచ భూతాత్మకమగు ప్రపంచము శ్రీ కృష్ణునినుండియే పుట్టి, ఆయన యందే అంతర్భూతమగుచున్నది. కాని మానవులు, ఈ జగత్తు భగవంతుని కంటె వేఱు సత్తా గల్గినదని భ్రమపడుచున్నారు. ఇదియే సర్వ అనర్థములకు కారణభూతమగు చున్నది. కొందఱు మాయావాదులు ఈ సృష్టి అసత్తనియు, కనబడుచున్నను స్వప్నము వంటిదని, మఱికొందఱు విశ్వమే ఉన్నది, భగవంతుడు వేఱుగ లేడని వాదించుచున్నారు. ఈ విధముగ మన బుద్ధికి తోచినదే వేదమని, యథార్థమని విశ్వసించుట వలన మనము భగవంతుని కంటె వేఱుగ పరికించిన ఈ జగత్తు ఉన్నదని, లేదని గూడ చెప్పవచ్చును.

అయ్యది దేవతలకు సైతము నేటికిని నిర్ధారణ చేయుటకు వీలుగాని విషయమై యున్నది. కనుకనే పరమాత్మ, చతుర్ముఖ బ్రహ్మ యొక్క హృదయములో ప్రవేశించి, జీవకోటి నుద్ధరించవలెనను దయతో నీ విషయమును నిర్ధారణము చేయు వేదములను లోకమున కొసంగెను. వేదములను భగవంతుని యొక్క వాగ్రూపమైన స్వరూపమే ననియు, వాని మూలముననే దేవతలు గూడ విచికిత్స జెందెదరను పై విషయము నిర్ధారణ చేసికొనబడవలసియున్నది. శ్రీకృష్ణుడొక్కడే జ్ఞాత, జ్ఞేయము, జ్ఞానము అను మూడు విధములగు 'అద్వయ జ్ఞాన తత్త్వము'. ఈ విషయము ఇంక రెండవ శ్లోకములో వాచిక, కాయక, మానసిక కార్యము లన్నియు శ్రీ కృష్ణుని వైపు మరల్చుటకు మార్గములను చెప్పెను. మన యొక్క మనస్సును కృష్ణుని నుండి దూరము చేయు వ్యతిరేక శక్తులు, అసత్ కార్యములు కొన్ని కలవు. అవి యేవియన మనకు మతము, ఆచారము, మడి అని పేర్లతో పిలువబడు ఛాందస్త కార్యములు, భాగ్య భోగ్యములు, ఇంద్రియముల తృప్తి కొరకు చేయు కార్యములు, తుట్టతుదకు ముక్తి కావలయునను నపేక్ష-ఇవి యన్నియు జీవులను శ్రీకృష్ణుని నుండి దూరముగా జేయు కార్యములే. శ్రీకృష్ణుని మనము మరచుచు ఆయనను గురించిన, ఆయన యొక్క చింతనమే మానవు డొనర్చు కొనవలసిన ముఖ్య కర్తవ్యము. అయ్యదియే సర్వకర్మల యొక్క ముఖ్య ఫలము . అయ్యదియే సర్వజ్ఞానముల యొక్క పరమార్థ ప్రయోజనము. మనము మనయొక్క మనస్సులను అట్టి చింతనవైపు మరలించుటయే మన అజ్ఞానమును పోగొట్టు కొనుటకు ముఖ్య మార్గము. అటుల జేసినచో మనకు ప్రస్తుతమున్నట్టి

గాని, ముందు కలుగబోవునట్టి గాని సర్వసంశయములు నివర్తింపబడును. లేనిచోలేదు.

పైన చెప్పబడిన అసత్కార్యమునకే జీవితమున మనము ప్రాధాన్యతను, అగ్రస్థానమును ఇచ్చుచున్నాము. జీవుడీయసత్కార్యములను జేయుటయందే తృష్ణ కలవాడగుచున్నాడు. ప్రాపంచిక సౌఖ్యములకుపకరించు పదార్థ సేకరణ యందే జీవుడు నిరంతరము తన కృషిని సాగించుచున్నాడు. జీవిక కొఱకు పెనుగులాడుట యనునది జీవితములో ముఖ్య సూత్రమగుచున్నది. ఎన్నెన్ని చిక్కులు, కష్టములు తటస్థించినను జీవికకొరకు కావలసిన వస్తువులను సంపాదించుట యెటులనా! యనునదియే ప్రధాన స్థానము నాక్రమించుచున్నది. శ్రీకృష్ణుని విముఖతతో గావింపబడు నీయన కార్యములే అనర్థ పరంపర కంతటికిని మూలకారణములు. మన సాంఘిక, నైతిక, రాజకీయ బాధలన్నిటికి మూల హేతువు శ్రీకృష్ణవిముఖతయే., నిజమైన జీవిత సౌఖ్యమునకు, సంతతాభివృద్ధికీ ప్రధాన కారణము శ్రీ కృష్ణప్రేమయే. అట్టి శ్రీకృష్ణ ప్రేమ యితర పదార్థములతో సంబంధము లేనిదిగా నుండవలయును. యథార్థ వస్తువని, వాస్తవ వస్తువని భాగవతములో వర్ణింపబడిన శ్రీ కృష్ణుని యందు ప్రేమగలిగి యుండుటయే యథార్థ, సచ్చిదానంద స్వరూపమైనది. జీవితములో నిట్టి సచ్చిదానందము అనుభవములోనికి తెచ్చుకొనుటయే, యథార్థ భక్తి. భక్తి రహితములై గావింపబడు కర్మలుగాని, జ్ఞానముగాని శుష్కములైనవియే యగును గాని, ఫలకారులు కావు. ముఖ్య వస్తువు శ్రీకృష్ణుడే. శ్రీకృష్ణ భక్తియే ముఖ్యమైనది. ఇక భాగవతము యొక్క మూడవ శ్లోకము ఇట్టి సచ్చిదానందమును తెలిసి కొనుటయే జీవించుచున్నందులకు ఫలమనియు, జీవిత పరమార్థమనియు నెఱుంగనగును. భూలోకమునకు శ్రీమద్భాగవత రూపమున నవతరించిన సర్వవేదములయొక్క సారమునిదియే యని నెఱుంగనగును. అట్టి శ్రీ మద్భాగవతమే శ్రీశుకదేవుల ముఖకమలము నుండి వెలువడిన అమృతము.

శ్రీ మద్భాగవతమనునది వేదములను వృక్షము నుండి లభించిన ముదర పండిన పండు. దానియొక్క రసమాధుర్యము, యథార్థ కృష్ణ భక్తులకు మాత్రమే గోచరించును. శ్రీమద్భాగవతమనిన శ్రీ కృష్ణుని యొక్క స్వరూపమనియే చెప్పవచ్చును. శ్రీకృష్ణుని భక్తులు కానివారలు భాగవతము యొక్క పైపై భాగములను స్పృశించగలరేగాని, దాని లోపల నుండు అమృతమును పానము చేయజాలరు. అయ్యది శ్రీ శుకదేవుల ముఖకమలము ద్వారా భూలోకమునకు

వచ్చి వ్యాప్తి జెందినది. అయ్యది మనన శీలురగు మునీశ్వరులకు మాత్రమే యందుబాటులో నుండును. వారే దీనిని నిరంతరముగ మననము జేసి పరమానందము ననుభవించ గలరు. ఓ నిర్మత్సరులగు భాగవత భక్తులారా! ఒక క్షణమైనను దానిని వదలి యుండవద్దు.

పాపభూయిష్టమగు కలియుగము ప్రారంభము కాబోవుచున్నదనగా వేలకొలది మహర్షులందరును నైమిశారణ్యమునందు సమావేశమై శౌనక మహర్షులవారి యాధిపత్యమున కొన్ని సంవత్సరముల వరకు జరిగెడు నొక సత్రయాగము జేయు నారంభించిరి.

వారందరు ఒకానొక రోజున సూర్యభగవానుడు తన అరుణ కిరణములతో తూర్పున ఉదయించబోవు సమయమున అచ్చటి యజ్ఞాగ్ని కుండము చుట్టు కూర్చొని యుండిరి. అప్పుడు శ్రీ శుకదేవుల కత్యంత ప్రియశిష్యుడైన శ్రీసూత గోస్వామి తాను పర్యటించుచున్నప్పటికి దయ చేయుట తటస్థించినది. అప్పుడచ్చటి మహర్షులందరు వారికి సుస్వాగతమిచ్చి, అనేక విధముల గౌరవించి, సుఖాసీనుల గావించిరి. అప్పుడచ్చటి మహర్షులందరుకు ముందు రాబోవు కలియుగ సంబంధమైన దుష్కాలము మనస్సుల యందు గోచరమై చాలా భయము కలిగెను. అప్పుడు వారందరు శ్రీసూత గోస్వామితో నిటుల మనవి జేసిరి. "ఓ మహానుభావా! మీరింతవరకు సర్వపురాణములను, చరిత్రలు మొదలగు మత గ్రంథముల నెన్నింటినో శ్రవణమొనర్చి, బోధించి, మమ్ముల కృతార్థుల గావించిరి. తాము వేదములయందు నిర్వచింపబడిన పారమార్థిక రహస్యములనన్నింటిని వేదవ్యాసుల వారి వలననేమి మరియు నితర మహర్షుల వలన నేమి నెఱింగిన మహానుభావులు. యథార్థ గురువు, యథార్థ శిష్యులకు తన మనస్సులోని ఆధ్యాత్మిక రహస్యములనన్నింటిని బోధించునే గాని, వానిని దాచిపెట్టుకొని యుండడు. ఊరక సర్వ విషయములను తెలిసికొనుటయే గాక వానినన్నిటిని ఆచరించిన మహనీయులు మీరు. తమరు యథార్థమగు ఆధ్యాత్మిక తత్త్వము నెఱింగినవారు. వేద స్వరూపుడే యని చెప్పదగిన శ్రీ గురుదేవుల యొక్క పాదపద్మముల నారాధించి ఆధ్యాత్మ తత్త్వమును సంపూర్ణముగా నెఱింగి దానిని ఆచరణలో గూడ పెట్టుకొనిన మహానుభావులు. ఇప్పుడే కలియుగము సంప్రాప్తించినది. కలియుగమునందు జనులందరును అల్పాయుష్కులు, మంద బుద్ధులు. ఆధ్యాత్మిక చింతన, భక్తియు లేక దుష్కర్మల యందు మక్కువ గలవారు గనుక వారికి వేదములనన్నిటిని చదువుట అసాధ్య కార్యము. తమరు

సర్వజ్ఞులు, గొప్ప జ్ఞానులు గనుక ఆ వేదముల యొక్క సారమునంతటిని మాకు శలవిండు. అది జీవులకు మహోపకారమగును. అయ్యదియే జీవులకు గొప్ప తృప్తిని, కృతార్థతను కలిగించును.''

మరియు అప్పుడా ఋషులందరు నిట్లనిరి. "సాత్వతుల యొక్క ప్రభువగు శ్రీకృష్ణుని యొక్క ప్రేమను మాకు వర్ణించి చెప్పుడు. దానిని వినవలెనని మేము కుతూహలాయత్త చిత్తులమై యున్నారము. అయ్యదియే ఐహికాముష్మిక విజ్ఞానాభివృద్ధికి మూలకారణము. అవకాశముగా నుచ్చరించినను శ్రీకృష్ణనామ మొక్కటియే మానవజాతి యొక్క మనుగడకు ముఖ్య హేతువు. అయ్యదియే యీ భయంకర సంసార సముద్రము నుండి తరింపజేయగల నావ. ఆయనను జూచిన మృత్యుదేవత గూడ భయపడి పరుగెత్తిపోవును. గంగోదకము మానవులు దానిని స్పృశించినప్పుడు, దానియందు స్నానాదుల నొనర్చినప్పుడు మాత్రమే వారలను కృతార్థులను గావింపగలదు. శ్రీకృష్ణనామ మన్ననోయటుల గాదు. అయ్యదియే విధముగా నుండి, యెటుల నుచ్చరించినను, అటుల నుచ్చరించిన వారిని గృతార్థుల గావించును. శ్రీ కృష్ణనామము ఒక్క పర్యాయము నుచ్చరించినంత మాత్రమున అతని యందుండు కాయిక, వాచిక, మానసిక సంబంధములగు దోషములన్నియు వెంటనే నశించిపోవును. కనుక కలియుగ దోషములనుండి విముక్తి నొందించి, కృతార్థులను గావించు శ్రీ కృష్ణస్వామి యొక్క అప్రాకృత లీలలను వినుటకు అపేక్షపడని మానవుడీలోకమున నుండునా? శ్రీ కృష్ణ నామము భక్తులందరి చేత సర్వదా చేయబడుచునే యుండును. అయ్యది మానవులకు గావలసిన సర్వస్వమును ప్రసాదించును. శ్రీకృష్ణనామము సంపూర్ణమగు శ్రీకృష్ణభక్తిని, ఆయన తన అవతారము నందు ప్రదర్శించిన లీలల యందు భక్తిని, తన శక్తి చేత ప్రసాదించును. శ్రీ కృష్ణలీలల యందలి భక్తియే సంపూర్ణమైన ఐహికానందము నొన గూర్చును. శ్రీకృష్ణనామమును వినిన కొలది పరమానందమును గలిగించును. నామము యొక్క సంపూర్ణ జ్ఞానము కలిగిన వెంటనే భగవంతుని యొక్క దివ్యగుణముల యొక్కయు, దివ్య లీలల యొక్కయు మహామహిమ మనపై వెల్లి విరియును. శ్రీ మహావిష్ణువున కత్యంత ప్రేమాస్పదమైన పవిత్ర స్థలమున మనమందఱమును సమావిష్టులమై యున్నాము. కలి మన యొక్క విజ్ఞానమునంతను నశింపజేయుటకు సంసిద్ధముగ నున్నాడు. ఈ అపార సంసార దుఃఖ సముద్రమునుండి మనలను దాటింపగలిగిన దొక్క శ్రీకృష్ణనామమే". అని శ్రీసూత గోస్వామివారు జీవులు కృతార్థులు జెందు సర్వోత్కృష్ట మతమును గురించి యుపన్యసించిరి.

# మార్గమున్నది కాని ఒక్కటే

ప్రతీ మనిషికి దైవారాధన చేయుటకు అధికారము కలదు. కానీ చాలామంది దైవారాధన పట్ల విముఖత కల్గియున్నారు. యిటువంటి వార్ని చూచి జాలి పడాల్సి వుంటుంది. ఇందులో కొంతమంది హేతువాదులు లేదా అనాత్మవాది (భౌతికవాదులు)గా మారుచుందురు. వారి ఆలోచన ప్రకారము వారి అభిప్రాయ మేమనగా శరీరము, మనస్సు మరియు బుద్ధి తప్ప మరియొకటి ఏది లేదని వారి వాదన. కాని వాక్, మనస్సు, బుద్ధిలకు గోచరము గాని "వస్తువు" (భగవంతుడు) ఉన్నదని వారికి తెలియదు. భగవద్భక్తి, ప్రేమ, భాగవత్సేవ అనే సర్వోత్కృష్టమైన ధర్మములు ఉన్నవని గ్రహించుము. అదే ఆత్మ ధర్మము. మనము భౌతిక వస్తువుల ద్వారా మోహింపబడుదుము. అదే విలువైన అభివృద్ధి అని మనము తలపోయుచుందుము. అదియే మాయ. కాని అది అవాస్తవమైన అభివృద్ధి. అదే సర్వోత్కృష్టమైనదని భావించుచున్నాము. కాని మన దౌర్భాగ్యమువల్ల (దురదృష్టము వలన) ఆత్మ ధర్మమును మరచి శాశ్వత ఆనందమునకు దూరమగుచున్నాము. ఆ దివ్యమైన ఆనందతత్త్వమును (భగవత్ పాదపద్మములను) పొందుటకు మార్గమొకటే. భగవత్ సన్నిధానమును జేరుటకు ఒక మతమునకు మరియొక మతమునకు భేదములేదు. అన్ని భేదములు వారు అవలంబించు సాధనలో మాత్రమే గలవు. ధర్మాధర్మ విచక్షణ కల్గియుండి, వాస్తవమైన, శాశ్వతమైన భగవత్ పాదపద్మములను పట్టుకొనుటకు చేయు ప్రయత్నమే ఆత్మ యొక్క ధర్మము.

శ్రీ చైతన్య మహాప్రభువు చెప్పిన విషయము ఏమనగా భగవంతుని పట్ల విశ్వాసము కల్గియుండుము. భగవంతుని పట్ల (కృష్ణ) ప్రేమను అభ్యాసము చేసుకొనుము,ఎవరినీ బాధింపకుము, నీ స్వలాభము కొరకు ఏమియు చేయకుము మరియు సంపూర్ణ యిష్టముతో నీవు యితరులకు సమర్పించవలసిన గౌరవమును యివ్వవలెను. వినయమును మరియు సహనమును అలవరుచుకొనుము. ప్రతీ జీవియందును భగవంతుడున్నాడు అను భావన నేర్పరచుకొనుము. భగవదారాధన చేయవలెను. భారతీయుల సాంస్కృతిక జీవన సృష్టి క్రమమును పరిశీలించినచో మన భారతీయుల ఆధ్యాత్మిక శాస్త్రము యొక్క ప్రభావము మనందరి మీద ఉన్నదని భావించుచున్నాము.